నిజాంరాష్ట్రములో

# రాజ్యాంగ సంస్కర

249

హైదరాబాదు

ప్రజాపరిషత్తువలన ఏర్పరుపబడిన కమిటీవా

## నివేదిక

౧౯౩౮ (౧౩౪౭ ఫ.)

ప్రకాశకులు,

హైదరాబాదు ప్రజాపరిషత్తు

కార్యాలయము; అబిద్‌రోడ్డు హైదరాబాదు

౧. [illegible] సభ్యులలోనుండి దిగువ వివరింపబడినవారిని, తమ ఇతరులను చేర్చు[illegible] పూ[illegible]కారముతో, రాజ్యాంగ సంస్కరణములను గురించిన [illegible] (పత్రాళిక) ను ప్రభుత్వమువారికి సమర్పించుటకై సిద్ధము చేయుటకుగా ఒక కమిటీగా ఏర్పరచనైనది.

కమిటీ సభ్యులు :

శ్రీ బూ. హనుమంతరావు.
,, [illegible]నరావు నానల్.
,, శ్రీపతిరావు పల్నిట్కర్, బి.ఏ., ఎల్ఎల్.బి.
,, కొ. వేంకటరంగా రెడ్డి, ఎం.ఎల్.సి.
,, అబ్దుల్లా పాషా, బి.ఏ., ఎల్ఎల్.బి., ఎం.ఎల్.సి.
,, అబుల్ హసన్ సయ్యదలీ.
,, యస్. వీ. నాయక్, బి.ఏ., బారిస్టరు.
,, సిరాజుల్ హసన్ తిర్మిజీ.
,, కలీముద్దీన్ అన్సారీ, బి.ఏ., ఎల్ఎల్.బి.
,, రామాచారి.
,, మహమ్మద్ అహసన్, బి.ఏ., ఎల్ఎల్.బి.
,, భాగ్యరెడ్డి వర్మ.
,, నరసింగరావు.
,, డి. డి. ఇటాలియా.
,, గణపతిలాలు.
,, బూ. రామకృష్ణరావు, బి.ఏ., ఎల్ఎల్.బి.
,, యస్. బి. శర్మ, బి.ఏ., బారిస్టరు.
,, కృష్ణ శర్మ
,, పి. వి. జోషి, బి.ఏ., ఎల్ఎల్.బి.
,, జనార్దనరావు దేశాయి.
,, రాజా పన్నాలాల్ పీతీ.
శ్రీమతి రుస్తుంజీ.
,, కర్నీలియసు.

[illegible]కు తగిన అవకాశమును గలిగించునటుల, శాసన సభయొక్క [illegible] ప్రసక్తి ర్మాణమును, ఇతర రాజ్యాంగ సంస్థల [illegible] ప్రవనమును గురించిన సంపూర్ణమగునొక ప్రణాళిక (స్కీము) ను సిద్ధముచేయుట.

ఆ. స్థానికస్వపరిపాలన సంస్థలు అనగా, గ్రామ పంచాయతీలు, లోకల్ బోర్డులు, జిల్లా మునిసిపాలిటీలు మున్నగువానిని స్థాపించుటకై పూర్ణమగు నొక ప్రణాళిక (స్కీము) ను సిద్ధముచేయుట.

ఇ. పై రెండు ప్రణాళికలకు సంబంధించిన వోటుహక్కుల నియమాలు, వోటర్ల శక్తి, వారి సంఖ్య, వోటర్ల హక్కులు మున్నగు విషయములనుగురించిన పద్ధతులను సూచించుట.

ఈ. వాక్స్వాతంత్ర్యము, సభాసమావేశ స్వాతంత్ర్యము, ఇతర పౌరస్వత్వపు హక్కులు మున్నగు ప్రాథమిక హక్కులను కాపాడుటకు సమంజసమగు పద్ధతులను సూచించుట.

## కార్యముపై సింహావలోకనము.

పై నిర్వచింపబడిన చర్చనీయాంశములయొక్క వైశాల్యతనుబట్టి సర్వవసానములను తేల్చుట కవసరమగు లెక్కలను విషయసామగ్రిని ప్రోగుచేయుటకై సంపూర్ణమగు విచారణ అవసరమయ్యెను. అందువల్ల కమిటీవారు ప్రజాభిప్రాయమును కనుగొనుటకై యొక ప్రశ్నావళిని పంపించిరి. స్థానిక పత్రికలందు ప్రకటించుటయేగాక, ప్రశ్నావళియొక్క సుమారు ౧౫౦౦ ప్రతులు నగరములోను జిల్లాలలోనుగల వివిధ సంస్థలకు, వ్యక్తులకు పంపబడినవి. ప్రశ్నావళిలో అనేక విషయములిమిడ్చబడియుండెను. ప్రజలవల్ల ముఖ్యముగా జిల్లాలనుండి మంచి ప్రత్యుత్తరములు లభించినవని తెలుపుటకు కమిటీవారు సంతసించుచున్నారు. మా ప్రశ్నావళి మేము ఆశించని స్థలములందును తీవ్రమగు ఉత్సాహమును కలిగించినది. వచ్చిన ప్రత్యుత్తరముల సంఖ్యను, ప్రజలలో కొందరుగావించిన వివరములతో గూడిన సూచనలనుబట్టి, ఈ విషయములనుగురించి అభిజ్ఞతలో లోపము లేదని తెలియుచున్నది. మొత్తము ౩౦౦ ప్రత్యుత్తరములు వచ్చినవి. ఇందులో హైదరాబాదు కాంగ్రెసు

కమిటీ, ఆది హిందూ సాంఘిక సేవాసమితి, ఇండియన్ క్రిస్టియన్ అసోసియేషన్, అంజుమనె-ఖవాతీన్ (యువతీమండలి), ఆంధ్ర జిల్లాసంఘములు, సాహుకార్లకమిటీ, మార్వాడీమండలి, మహారాష్ట్రజిల్లాసంఘములు, అంబేడ్కరు యువజన సంఘము, యూనాని ఆయుర్వేదవైద్యమహాసభ, ఆది హిందూమహాసభ మున్నగు అనేక సంస్థలు చేరియున్నవి. ప్రత్యుత్తరము లొసంగినవారియొక్క సాంఘిక పరిస్థితులు పలువిధములు. అందులో వివిధ తెగలకు వృత్తులకు సంబంధించిన ప్రతినిధులున్నారు. సాహుకార్లు, ఇతర వ్యాపారస్థులు, రైతులు, జమీన్‌దారులు, వకీళ్లు, డాక్టర్లు మున్నగు వారందరు గలరు. ఈ యభిప్రాయములనన్నిటిని, జాబితాలుగా వ్రాసి, కార్యసౌలభ్యముకొరకు సన్నాసిద్ధము చేయనైనది. ప్రత్యుత్తరములను జిల్లాల ప్రకారము ఈ క్రింది విధముగా విభజింపవచ్చును. పర్భనీ జిల్లా ౫౦, నాందేడ్ ౫, ఔరంగాబాద్ ౪౦, బీడు ౨౦, వరంగల్ ౨౫, కరీంనగర్ ౧౫, నల్లగొండ ౧౩, మెదకు ౧, మహబూబునగరం ౧౨, బిదర్ ౨, రాయచూరు ౧౫, గుల్‌బర్గ ౨౫, అత్రాఫుబల్దా ౪, ఉస్మానాబాద్ ౧౫, సికింద్రాబాద్ ౩, హైదరాబాద్ ౪౧.

ప్రత్యుత్తరములు పంపుటకై మొదలు నియమింపబడిన కాలము స్వల్పమైనందున అది డిసెంబరు వరకు విస్తరింపబడెను. ఈ కమిటీవారు తమపనిని ఆరంభించినపిదప ప్రభుత్వమువారిచే ఏర్పరుపబడిన ప్రత్యేక కమిటీకి వ్యక్తుల తరఫునుండియు సంస్థల తరఫునుండియు ఈ విషయమున రాబోవు నివేదికలను స్వీకరింపవలసినదని ఆజ్ఞ యొసంగబడియెను. ఈ కమిటీవారు మొదలు ౨౬ డిసెంబరువరకు గడువు నేర్పరచియుండిరి. ఆ కాలమును విస్తరింపవలయునని తెలుపుకొనగా ప్రభుత్వమువారు ఒక మాసమువరకు అపరిమితిని విస్తరించిరి. ఇందువలన మా కమిటీవారికిని ప్రజలకు ప్రశ్నాపత్రియొక్క ప్రత్యుత్తరము లొసంగుటకై మరిమూడు వారములు కాలమిచ్చుట కవకాశము లభించెను.

మేము ౧౨ సబుకమిటీసభలు, ౩ రాజ్యాంగ సంస్కరణ, ప్రాంచైజుయొక్క మిశ్రితసభలు, ౭ సంపూర్ణ కమిటీసభలు, సమావేశ పరచినాము. ఈ సభలన్నిటిలో సభ్యులు సరిగా హాజరగుచు చర్చించబడుచున్న విషయములందును, వారి నెదుర్కొన్న సమస్యలవిషయమునను మంచిఉత్సాహమును వ్యక్తపరచిరి.

కమిటీయొక్క కార్యములో పాల్గొని అమూల్యమగు సహకార మొసగ్గిన శ్రీమతి పద్మజా నాయుడు గారు ౧ జనవరి ౧౯౩౮ తర్వాత నగరములో

నుండజాలకపోయినందుసను, డాక్టరు లతీఫు సయీదుగారు అస్వస్థతవలసను కమిటీ కార్యములలో పాల్గొనజాలక పోయినందునకుగాను కమిటీవారు చింతిల్లుచున్నారు. కమిటీలో తర్వాత జేర్చుకొనబడిన శ్రీయుతులు, నవాబు దోస్తు మహమ్మదు ఖాన్ బహద్దరు, లక్ష్మణరావు గారు, హసనుద్దీన్ గారలు కమిటీలో [illegible] తెలిపిరి. హైదరాబాద మహిళా సాంఘిక విజ్ఞానాభివృద్ధి సంఘము [illegible] S.A ప్రతినిధురాండ్రుగా పంపబడిన శ్రీమతి రుస్తుంజీ, శ్రీ[illegible] గారలు కమిటీయొక్క కార్యక్రమమున దాదాపు తుదవరకు [illegible] మున ర్చిరి. కాని వారి సంఘముయొక్క తీర్మానము ప్రకారము, ఈ కమిటీనుండి చివరకు వారువిడిచి పోవలసివచ్చినది. వారి సహకారము కార్యాంతము వరకు లభింపక పోయినందులకు చింతించుచు, వారు గావించినపనికై వారిని కమిటీవారభినందించుచున్నారు.

మౌల్వీ అబుల్ హసన్ సయ్యదు అలీ, అబ్దుల్లా పాషా, కలీముద్దీన్ అన్సారీ, మహమ్మదు అహసన్ గారలు వివిధ సబు కమిటీలందును కమిటీలందును పాల్గొని పరిషత్తులో అన్ని కార్యములందు హృదయపూర్వకముగా సహకారమొనర్చిరి. ఫుల్ (సంపూర్ణ) కమిటీ సమావేశము చివరవరకు, అనగా ౨౩ జనవరి ౧౯౩౮ నాటివరకు, కమిటీవారు వారిసహకారమును సంపాదన [illegible]. అంతమునందు మహమ్మదీయ సభ్యుల సంఖ్యను ప్రత్యేకించు సమస్య వారికి తృప్తికరముగా పరిష్కారముకాని కారణమున పరిషత్తులో తమ సంబంధముచు తొలగించుకొనుటవసరమని వారుతలంచిరి. చర్చాసందర్భమున, సామాన్య (జనరల్) వోట్లనుండి ఎన్నుకొనబడు సభ్యుల స్థానములలో నూటికి (౫౦) వంతున మహమ్మదీయులకై ప్రత్యేకింపబడవలయుననియు, కమిటీవారు ఈ సూచన నంగీకరించినచో మహమ్మదీయులందు దీనివలన విశ్వాసము జనించుననియు సూచింపబడెను. ఇష్టాగోష్ఠి సందర్భములో, ఈ రాష్ట్రముయొక్క పరిస్థితులను మర్యాదలనుబట్టి ప్రత్యేక సంఖ్యానిర్ణయ మనవసరమనియు, మహమ్మదీయసంఘము ఆ విషయమున పట్టుదల గలిగినచో నూటికి ౨౦ వంతున ప్రత్యేకించుటకు (ఇతరస్థలములకై పోటీ చేయు స్వాతంత్ర్యము నిలిపియుంచి) హిందువులు బహుశః ఒప్పుకొనవచ్చుననియు తెలుపబడినది. ఈ విషయమున రాజీ కుదురజాలక ఇష్టాగోష్ఠి సంభాషణలుకూడ అసంపూర్ణముగా ఆగిపోయినవి. శ్రీయుత అబుల్ హసన్ సయ్యదు అలీగారును, వారిసహచరులును ఫ్రాంచైజు (వోట్ల సంబంధమగు) విషయములకైనను, శాసన

సభలకివ్వబడు అధికార సంబంధములగు విషయములకైనను, వారి దృక్పథము ఈ సమస్యపైననే ఆధారపడి యుండుననియు, ఇవ్విధములగు సమస్యల పరిష్కారము బహుజనాభిప్రాయ ప్రకారము గావించు తత్వముతో వారేకీభవించజాలనందువలన పరిషత్తుతో ముందు వారు సహకారము జేయుటకు వీలులేదనియు భావించిరి. ఈ మంచితరుణమున విడిపోవుటవసరమని ఈ మహాశయులు తలంచినందుకు కమిటీ వారు చింతించుచు, వారు కమిటిలో హార్దికముగా గావించినపనిని గురించి కృతజ్ఞతను వెల్లడించుచు, పరిషత్తును విడిచిపోవుటకు నిర్బంధించిన భావముయొక్క యథార్థమును గమనించుచున్నారు.

## కృతజ్ఞత.

ప్రజలనుండి వచ్చిన విలువగల ప్రత్యుత్తరములవలన మాకు లభించిన సహాయమును ఇందుమూలముగా ప్రశంసించుట కెంతయు సంతసించుచున్నాము. అందులో పలువురు అనేక వివరములను వేరు వేరు జాబితాలందు చూపించుటచే కమిటీవారికి ఆలోచనయందవి మిగుల సహాయమొనర్చెను. మా పనిని గురించి ప్రకటించినందులకు పత్రికలకు మేము కృతజ్ఞులము. ముఖ్యముగా 'హైదరాబాదు బుల్లెటిన్' 'పయాం' 'నిజాంవిజయ' 'రయ్యతు' పత్రికలు మా ప్రశ్నావళిని సంపూర్ణముగా ప్రకటించి, ప్రజలలో ఈ విషయమున ఉత్సాహమును కలిగించి, తన్మూలమున మిగుల సహాయమొనర్చినవి. కమిటీయొక్క పనిని తుదవరకు సాగించుటలో కార్యదర్శులు అవిశ్రాంతముగచేసిన సేవను కమిటివారు ప్రశంసించుచున్నారు. అధ్యక్షుడు కమిటీ సభ్యులందరికిని వారి సహకారమునకై తన కృతజ్ఞతను వెల్లడించుచు, శ్రీయుతులు కృష్ణశర్మ, బూర్గుల రామకృష్ణరావు గారలు పరిషత్తు మరియు కమిటీలయొక్క కార్యములు నిర్వర్తించుటలో గావించిన నిరంతర కృషిని, కార్యదీక్షను. ప్రశంసాపూర్వముగ వేర్కొనుటకు సంతసించుచున్నాడు.

## ఉపసంహారము.

మనరాష్ట్రముయొక్క భావి రాజ్యాంగనిర్మాణసమస్య రాష్ట్రప్రజల ముత్సాహమునకు తావలములగు సాధారణసమస్యలకంటె మిగుల విశిష్టమయినది. సామాన్యులకు నిస్సంశయముగా ఈ సమస్య దూరస్థమును, అరుచికరముగను కనపడుచుండును; కాని. యథార్థమేమన, ఈ సమస్యకు సరియగు పరిష్కార మెట్టిదైన

నగుగాక, రాష్ట్రివాసులయొక్క జీవితములపై మంచి కొరకో చెడుపుకొరకో ఇతఃపూర్వము ఏ సమస్యవలనను కలుగనట్టి పరిణామము దీనివలన తప్పక కలుగు ననుటలో సందియములేదు. పూర్వమువలె ఇప్పుడుకూడ హైదరాబాదు భారతదేశ పునర్నిర్మాణములో ముఖ్యస్థానము (key point) నలంకరించుచున్నది. మన ప్రభుత్వమువారి వర్తమాన ప్రయత్నముల సాఫల్యతపై చాలవరకు ఉన్నతమగు ఘనరుద్ధరణము పొందుచున్న భారతీయ సౌధ నిర్మాణ మాధారపడి యున్నది.

విషయమింతకంటె గహనముగ నుండజాలదు. మన రాష్ట్రప్రజల సాంఘిక పరిస్థితులు చిక్కులతోగూడుకొని పరస్పర విభేదముల కాలవాలములై యుండు చున్నందున, ఏయొక్క ప్రణాళిక విషయములోను, వాటినన్నింటిని విడదీయుట కాదర్శ ప్రాయమగు మార్గమని చెప్పుట కెవడును సాహసించలేడు. ఇందువలన కొంతవరకు రాజీల మార్గము నవలంబించుటయనివార్యము. తాత్వికముగా నైనను నిరాక్షేపణీయమగు ఆదర్శ ప్రాయమైనను ఒకే మార్గము నన్వేషించితిమి. కాని అట్టిదేదియు కనుగొనజాలక పోయితిమి. మన మన్వేషించు మార్గము మన యవసరములకేకాక బృహద్భారత దేశముయొక్క అవసరములనుగూడ గమనించి నిర్ణయించదగినదై యుండవలయును. వేయేల? ఆ మార్గము ప్రస్తుత పరిస్థితుల కనుగుణ్యముగా నుండవలయును. ఈ పరిస్థితులను గమనించుటలో రాష్ట్రప్రజలయొక్క వివిధ ప్రత్యేక స్వామ్యములు జ్ఞాపకము నుంచుకొనవలయును.

తుది తీర్మానముయొక్క భారము నిస్సంశయముగా ప్రభుత్వమువారిపైనను ఆపైన మ. ఘ. వ. నిజాం ప్రభువుగారిపైనను గలదు. కాని మా యీ విచారణ సందర్భమున ఒకసంగతి స్పష్టపడినది. ప్రజలు మరేవిషయమ్మునందు భేదాభిప్రాయములుగా నున్నను, రాష్ట్రివాసులలో ప్రతి యోచనాపరుడైనవాడు రాష్ట్రీయ రాజ్యాంగ విధానమునందు ముఖ్యమగు మార్పులు దినదినము అత్యావసరమగుచున్నవను విషయమున మాత్రము ఏకీభవించుచున్నాడు. కావున ఉద్భవించుచు ముఖ్యప్రశ్న 'ఎవ్విధమగు మార్పులు కావలయు'ననునదే! ప్రభువుగారికి వారికిష్టమువచ్చిన మార్పులను ప్రవేశపెట్టుట కధికారముగలదు. కాని అట్టిమార్పులు కార్యకారులుగా గావలెననిన, చారిత్రికస్థితిని, వర్తమాన పరిస్థితులను, భావ్యాశయములను గమనించవలసి యుండును. అవినేడు మనచుట్టుప్రక్కల జరుగుచున్న స్థితిగతులవలన జనించును. కొలదిమంది అతివాదులు మాత్రమే 'స్థితిగతులు ఉన్నవి ఉన్నటులుండవలయు'నని

యు [illegible] ద్ర [illegible] నిర్ణయము [illegible]
వరకు ప్రస్తుత పరిస్థితుల దృష్టియుంచి కొలదిపాటి మార్పులు చేయవలెనని విచారించుచున్నట్లు తెలియుచున్నది. మరియొక తెగ వారు [illegible] రాజ్యాంగ విధానమునన్వేషించుచున్నది. మా అభిప్రాయమున, ఇకముందు వివరింపబడు కారణములచేత, మనకు యుక్తమగునది పార్లమెంటరీ విధానము. అదియే ప్రభువుగారి ఫర్మానులలోను సందేశములలోను సూచితమైనది. దానినే రాష్ట్రము యొక్క పరిస్థితులకును అవసరములకును అనుగుణముగా ఈ నివేదికయందు మే మును సూచించినాము.



# మొదటి భాగము.

## (అ) పూర్వచరిత్ర

### మంత్రులద్వారా వ్యక్తిపరిపాలనము

"ఈ రాజ్యమున మొట్టమొదట వ్యక్తి పరిపాలనా పద్ధతి (Personal Rule) యుండెను. మొదటి సాల్గిరిగ నిదిని దాదాపు నియమబద్ధపరిభుత్వము (Constitutional Govt.)గా మార్చెను" అని ఘనతవహించిన మన పూర్వపు ప్రభువు, నవాబ్ మీర్ మహబూబలీఖాన్ గారు, మన రాజ్యాంగస్థితిని ౧౩౨౨ ఫ.(౧౯౧౨) లో జారీ చేయబడిన "ఖానూన్చా ముబారకు" లో వివరించి యుండిరి. హిందూ దేశములోని సంస్థానములన్నిటిలోను, అతి పురాతన కాలమునుండి వచ్చుచున్న రాజ్యాంగ విధానము వ్యక్తి (Personal) పరిపాలనము లేక ఏకైక ప్రభుత్వము (Unitary) అనునదియే. ఈ పద్ధతిలో, రాజ్యాంగమునకు ముఖ్యుడగు రాజే కార్య నిర్వహణమునకు ముఖ్యుడు; శాసన నిర్మాణమునకును అధికారమునకును అతడే మూలవిరాట్టు. మన రాజ్యాంగముయొక్క అంతరంగిక పాలనాస్వరూపమును ఇదియే. ఇక, బహిరంగవిషయములలో మన రాజ్యాంగమునకు చక్రవర్తిగారితోను ఇండియా ప్రభుత్వముతోను ఎట్టి సంబంధములు కలవో అవి, వేర్వేరు సంధి పత్రములలో స్పష్టపరచబడియున్నది.

మన రాజ్యముయొక్క పాలనము యించుమించుగా నంతయు దివానుల (మంత్రుల) అధీనములోనుండెను. మంత్రులద్వారా నడుపబడుచుండిన పరిపాలనము రాజునకుగాని ప్రజలకుగాని సర్వకాలములందును సంపూర్ణముగా తృప్తికరమై యుండ లేదనునది చరిత్రాంశము. కావుననే కొందరు దివానులు రాజ్యముయొక్క శక్తి సామర్థ్యములను అనేక విధముల, అనేక కారణముచేత, దుర్బలపరచుటకు కారకులైరని చెప్పుచున్నారు. వ్యక్తిపరిపాలనమునందు ఈ విధమున కలిగిన లోపములను మన పూర్వపు ప్రభువుగారు చాలకాలము క్రిందనే గ్రహించియుండిరి. మన ఇప్పటి మహా ఘనతవహించిన ప్రభువుగారు, బాబహుకూమతు (Executive Council) యొక్క ప్రారంభోత్సవ సందర్భమున ౧౬ దై ౧౯౨౯ ఫ. (౨౧-౧౧-౧౯౧౯) నాటి తమ యుపన్యాసమునందు ఈ సంగతి స్పష్టముగా ప్రకటించియుండిరి.

## "ఖానూన్చా ముబారకు".

మనపూర్వపు ప్రభువుగారు పరిపాలనలో కలిగిన ఈలోపమును, వారిదృష్టి నాకాలమున నాకర్షించిన యితర లోపములను గమనించి కొన్ని నియమముల నేర్పరచిరి. ఈ నియమములలో, పరిపాలనను ఎక్కువ శ్రేష్ఠముగా చేయుటకై అప్పుడప్పుడు మార్పులు చేయబడెను. అట్టిమార్పులలో ముఖ్యమైనవి రెండు: ఒకటి క్యాబినెటు కౌన్సిలు స్థాపనము: రెండవది శాసన సభాస్థాపనము.

"క్యాబినెటు కౌన్సిలు, సమిష్టిగా, హైదరాబాదు రాజ్యములో అన్నిటికంటె ఉన్నతమైన ఆలోచనాసంఘము. ఇది ఘనతవహించిన ప్రభువుయొక్క ఆజ్ఞలకు లోబడియుండును. దీనికి మంత్రి (Minister), అధ్యక్షుడు. తత్కాలమున అధికారములోనున్న సహాయ మంత్రులును (Assistant Ministers), ఘనతవహించిన ప్రభువువలన అప్పుడప్పుడు యోగ్యులుగా నియోగింపబడువారును సభ్యులైయుందురు. క్యాబినెటు కౌన్సిలుచేయు తీర్మానములను అమలులోపెట్టుట మంత్రియొక్క కర్తవ్యమైయుండును. కాని కౌన్సిలు స్వయముగా కార్యనిర్వాహణాధికారములను సాగించగూడదు." (చూ. పేరా 3. ఖానూన్చాముబారకు). ఇట్టి అధికారములు కలదగుటవలన క్యాబినెటు కౌన్సిలు నిరుపయోగమైనది. దీనిని సజీవముగా జేయుటకు అప్పుడప్పుడు యత్నములు జరిగినను, అది పరిపాలనమున ఎక్కువ ముఖ్యమగు పాలును కొనజాలదయ్యెను. ఇది కేవలము ఆలోచనా సంఘమగుట వలననే నిరుపయోగమై పతనము చెందినదని చెప్పుచున్నారు.

"ఖానూన్చాముబారకు" ద్వారా స్థాపింపబడిన శాసనసభ, కొన్ని అముఖ్యములగు మార్పులు జరిగినను, నాటినుండి నేటివరకు అదేస్థితిలో నున్నది. దీని వివరములు మరియొకచోట చూపబడియున్నవి.

## బాబెహుకూమతు.

పైనచెప్పిన రాజ్యాంగ విధానము మ. ఘు. వ. ఇప్పటి ప్రభువుగారు సింహాసనాసీనులైన తరువాతగూడ, ౧ డిసెంబరు ౧౯౧౮ (౧౩౨౮ ఫ.) వరకు సాగుచునేయుండినది. కాని, పై తారీఖున, మ. ఘు. వ. ప్రభువుగారు దీవాను

(నుదారుల్ మొహామ్) సహాయముతో పనిచేసి, పరిపాలనా విధానమును స్వయముగా నడిపించనారంభించిరి. దీనివలన కలిగిన ప్రత్యక్షానుభవమువలన, ౧౩౦౨ ఫ. (౧౮౯౨) లో ఏర్పరుపబడిన రాజ్యాంగ విధానమును వారు లోపముగా పరిగణించిన వనియు, సమూలమగు మార్పులు చేయుట ఆవశ్యకమని (శ్రీ) వారు నిర్ణయించిరి. “మంచి పరిపాలనయొక్క బునాది, పరిపాలకుని స్వతంత్రమగు యోగ్యతే” దనియు, “రాజకీయ సంప్రదాయములును, వాని నిరంతరాయమగు ప్రగతియును సత్పరిపాలనమునకు బునాదు”లనియు (శ్రీ) వారిచే ప్రకటింపబడి ౧౩౨౯ ఫ. (౧౯౧౯) లో “బాబెహుకూమతు” స్థాపింపబడెను. ఈ సంస్కారమువలన కలిగిన గొప్ప మార్పు, ఏమనగా, కేవలము ఆలోచన సంఘముగానుండిన ఎగ్జిక్యూటివు కౌన్సిలును తీసివేసి దానిస్థానమున స్పష్టములును, సంపూర్ణములునునగు పరిపాలనాధికారములుగల “బాబెహుకూమతు” నెలకొల్పబడినది. ఈ “బాబెహుకూమతు” పరిపాలనయొక్క అన్ని శాఖలకును బిగువుకలిగించి, మ. ఘ. న. ప్రభువుగారి స్వంత అధికారము కొరకు ప్రత్యేకింపబడిన, అసాధారణ రాజ్యాంగ విషయములలో (శ్రీ) వారికి మంచియాలోచనలు చెప్పగలదయ్యెను. దీని అధ్యక్షుడు, తనప్రదేని అభిప్రాయము అల్ప సంఖ్యాకమైనస్థితిలో, సభయొక్క తీర్మానమును, ఇష్టమునచో, ప్రభువుగారియెదుట తనఅభిప్రాయ సహితముగా పెట్టుకొను, ప్రభువుగారి ఆజ్ఞఅగువరకు అట్టితీర్మానముయొక్క అమలును నిలిపియుంచుటకును అధికారముకలిగి యుండునని విధించబడినది. బాబెహుకూమతుకుగల అధికారములను సవిస్తరముగా వివరించుట కిది సంధర్భము కాదుగనుక ఈ విషయము నింతటితో వదలివేయుచున్నాము.

## శాసన సభ.

ఇప్పుడున్న మన శాసనసభయొక్క నియమావళి, శాసనసభవలన, ౧౩౦౯ ఫ. (౧౮౯౯) యొక్క ౧ వ శాసనముద్వారా అంగీకరింపబడెను, తరువాత అదేసంవత్సరపు ౨వ శాసనముద్వారాయును మరల ౧౩౧౭ ఫ. (౧౯౦౭) యొక్క ౧వ శాసనముద్వారాయును, నియమావళిలో కొద్ది మార్పులు చేయబడినవి. ఈ శాసనసభలో మొత్తము ౨౧ మంది సభ్యులున్నారు. వారిలో అధ్యక్షుడు (President), ఉపాధ్యక్షుడు (Vice-President) కాక ౧౧ మంది అధికారులు ౬ గురు అధికారేతరులు; మిగిలిన యిద్దరు అసాధారణ సభ్యులు.

అధికారులలో; ముగ్గురు అనగా ప్రధానన్యాయాధిపతి (Chief Justice), ముఖ్యశాఖామాని (Legal Adviser), న్యాయశాఖాకార్యదర్శి (Judicial Secretary తమ అధికారమునుబట్టి (Ex-officio) సభ్యులుగనుందురు. మిగిలినవారిని ప్రధానమంత్రి నియమించుచుండును. అధికారేతరులలో ఇద్దరు సంవత్సరమునకు ఆరువేల రూపాయలుగాని, అంతకెక్కువగాని ఆదాయముగల జాగీరుదారులును, ఇద్దరు హైకోర్టు వకీళ్లును ఉందురు. ఈ రెండువిధముల సభ్యులును ఆయాతరగతులకు చెందిన వారివలన ఎన్నుకొనబడెదరు. మిగిలిన ఇద్దరు అనధికార సభ్యులను, ప్రధానమంత్రి నిజాము రాష్ట్రములోని ఇతరప్రజలలోనుండి నియామకము (nominate) చేయును వీరిలో నొకరు పాయగాలవలన నియోగింపబడినవారైయుందురు. శాసనసభా నియమావళిలోని ౨౦ దఫా ప్రకారము ఈ సభ ఈక్రింది అధికారములు కలిగి యుండును. (అ) దరఖాస్తులను ఇతర విజ్ఞప్తులను ఆలోచించుట, (ఆ) శాసనసభలో సభ్యులు ప్రవేశపెట్టదలచిన ప్రతిపాదనలను ఆలోచించుట (ఇ) చిత్తుశాసనముల నాలోచించుట. చిత్తుశాసనములను ప్రవేశపెట్టుటను గురించియు, సభలో ప్రతిపాదనము సల్పుటను గురించియు కలఅధికారములకు పైనియమావళియొక్క ౩౮ దఫాలో హద్దులేర్పరుపబడియున్నవి. అవేవనగా, ఈ క్రిందివానికి సంబంధించిన చిత్తు శాసనముగాని, ప్రతిపాదనగాని ప్రధానమంత్రియొక్క అంగీకారము పొందనిది ప్రవేశపెట్ట గూడదు :—

(అ) ప్రభుత్వాదాయము, లేక, ప్రభుత్వరుణము, లేక అట్టిఆదాయముపైనగాని, ప్రభుత్వపు ఖజానాపైనగాని భారమువేయు ఏదేని విషయము.

(ఆ) ఘ. వ. ప్రభువుయొక్క ప్రజలలోని ఏ తెగవారివైనను సరే, మతవిశ్వాసములు, కర్మకాండలు, మతాచారములు.

(ఇ) ఘ. వ. ప్రభువుయొక్క సైన్యపు వ్యయములు, సైన్యముల క్రమశిక్ష (discipline).

(ఈ) ఘ. వ. ప్రభుత్వమునకును బ్రిటిషు ప్రభుత్వమునకునుగల సంబంధములు.

(ఉ) ఈ శాసనము (శాసనసభా నియమావళి).

(ఊ) షు. వ. ప్రభువుగారియొక్క తత్కాలమున అములులోనుండు ఏవేవి ఆజ్ఞలకు ఏవిధముగానైనను విరుద్ధముగానున్న ఏదేని ఇతర విషయము.

ఇట్టి చిత్తుశాసనముగాని, ప్రతిపాదనముగాని, ప్రధానమంత్రి అంగీకారముతో ప్రవేశ పెట్టబడిన పక్షమున అట్టిదానికి ప్రభువుగారి అంగీకారము లభించిననేగాని అది శాసనము కాజాలదు.

ఈసందర్భమున ఈరాష్ట్రపుశాసన సభయొక్క వికాసము ఎట్లుజరిగినదో వివరించుట అవసరము. మనశాసనసభ మొట్టమొదట ౬వ ఇస్ఫందారు ౧౩౦౩ ఫస్లి. (౯ జనవరి ౧౮౯౪) నాటిఫర్మాను ప్రకారము ఏర్పడినది. ఖానూన్చాముబారకు జారీ అయిన కొలదికాలమునకే ఈ ఫర్మాను వెడలినది. పై ఫర్మానుద్వారా స్థాపింపబడిన శాసన సభలో సభ్యుల సంఖ్య ౧౫. వీరిలో ౬ గురు అధికారేతరులు; వీరందరును ప్రధాన మంత్రివలన నియామకము చేయబడుచుండిరి. ముగ్గురు అధికార రీత్యా సభ్యులు (ప్రధాన న్యాయాధిపతి, ముఖీ రెఖానూని, న్యాయశాఖాకార్యాదర్శి). అధికారేతరులగు ౬ గురిలో ఇద్దరు జాగీర్దార్లలో నుండి (వీరిలో జమీందార్లుగూడ చేరియుండిరి) తీసికొనబడుచుండిరి; ఇద్దరు వకీళ్లలోనుండియు, మరియిద్దరు ప్రజలలోనుండియు నియమింప (nominate) బడుచుండిరి. ౧౩౦౯ ఫ. యొక్క ౩వ శాసనముద్వారా అధికారులగు సభ్యుల సంఖ్యలో ఇద్దరు ఎక్కువ చేయబడిరి. ఈ విధముగా సభాసదుల సంఖ్య, అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడుకాక, ౧౭ అయినది. అధికారేతరుల ప్రాతినిధ్యములో స్వల్పమగు మార్పుచేయబడెను. ఇద్దరు వకీళ్లు, ఇద్దరు జాగీర్దార్లు ఎప్పటివలెనే యుండిరి. ఒక సభ్యుడు పాయగాల పక్షమునను మరియొక సభ్యుడు ప్రజాపక్షమునను ఉండెను. వీరును ప్రధానమంత్రివలన నియమింపబడినవారే యనుట నిస్సంశయము. ఈ స్థితి దాదాపు ౬ సంవత్సరములవరకు జరిగినది. ౧౩౧౫ ఫ. (౧౯౦౫-౦౬)లో ౧ వ శాసనము ద్వారా అధికారేతరుల సంఖ్య అధికారుల సంఖ్యతో సమానముగా చేయబడినది. ఈ సంవత్సరములో, నియమిత కాలము దాటిన తరువాత వెడలిపోవుచున్న సభాసదులలోనుండి యైననుసరే ప్రజలలో నుండియైనను సరే, ఇద్దరు అసాధారణ సభాసదులను నియమించు అధికారము ప్రధానమంత్రి కియ్యబడినది. తిరిగి శాసన సభాసభ్యులలో మార్పుజరుగుటకు ఆరు సంవత్సరముల కాలము పట్టినది. ౧౩౩౦ హిజ్రి (౧౯౧౧)లో జారీ అయిన ఫర్మానుద్వారా అధికారేతర సభ్యుల

సంఖ్యలో ముగ్గురు, పరీక్షార్థము ఆరు సంవత్సరముల కొరకు, హెచ్చించబడినందున, అధికారేతర సభ్యుల సంఖ్య ౧౧ అయినది. ఈ ముగ్గురిలో ఒకరు పురపాలక సంఘము (City Municipality) పక్షమునను, తక్కిన ఇద్దరు సూబాల లోకల్ఫండు సంఘముల పక్షమున వంతులవెంబడియును, రావలసియుండిరి. పరీక్షార్థము చేయబడిన ఈ ప్రయత్నము, దురదృష్టవశమున, పరీక్షాకాలము గడచిన తరువాత ఆగిపోయెను. అయినను, మరుసటి సంవత్సరమున (౧౯౧౨), సర్ఫెఖాసు ముబారకు పక్షమున ఒక ప్రతినిధిని పంపు ఏర్పాటు జరిగినందున సభ్యుల సంఖ్య హెచ్చినది ఈ విధముగా, సర్ఫెఖాసునుండి వచ్చిన ఒక సభ్యుడధికమగుట తప్ప, నేటి శాసన సభ ౧౩౦౫ ఫ. నాటి సభవంటిదే యని తెలియగలదు.

## ౧౩౩౦వ హి. (౧౯౧౯) ఫర్మాను.

'ఎంతటి సమర్థుడైనను ఒక పరిపాలకుడు చేయు పాలనముకంటె' కౌన్సిలుచే జరుపబడు పాలనము యథార్థముగా శ్రేష్ఠతరమని భావించి, అట్టి పాలనముయొక్క లాభములు రాష్ట్రమునకు కలిగించినట్టి వెనుక చెప్పిన ఫర్మానులోనే శాసనసభ యిక ముందు సంస్కరింపబడునని వాగ్దానము చేయబడియుండెను. ఈ వాగ్దత్తమును మ. ఘ. వ. ప్రభువుగారు త్వరలోనే చెల్లించగోరి, ౧౩ జమాదిస్సాని ౧౩౩౮ హిజ్రి (౧౭-౨-౧౯౧౯) తారీఖుననే ఫర్మాను జారీ చేసిరి. దీని ద్వారా శ్రీవారు, శాసనసభను సంస్కరించుటకుగాను ఒక విస్పష్టమైన స్కీము సిద్ధపరచుటకు వలయు సాధనములను వెంటనే సమకూర్చుటకై, అప్పటి సదరుఆజము (President, Executive Council) గారికి అధికారమిచ్చిరి. ఈ ఫర్మానులో ఏయేవిషయములను గురించి విచారణ జరుగవలెనో వివరముగా సూచించి, ఈ క్రింది విచారణాంశములను నిర్ణయించియుండిరి.

౧. శాసనసభలోని ఎన్నుకొనబడు సభ్యుల సంఖ్యను బాగుగా హెచ్చించుట.

౨. ప్రత్యక్షమగు ఎన్నికలపద్ధతి.

౩. ప్రత్యేక తెగల ప్రాతినిధ్యము.

౪. అల్పసంఖ్యాకులగు వారి హక్కులను రక్షించుట.

౫. వోట్లిచ్చుటకు షరతులు.

౬. అధికారులగు సభ్యుల సంఖ్య.

౭. శాసనసభయొక్కయు, సభ్యులయొక్కయు అధికారములు; కర్తవ్యములు.

కీ. శే. రాయ్ బాలముకుందుగారి విచారణ.

పైన చెప్పిన ఫర్మానుప్రకారము, స్థితిగతుల విచారించి అవసరమగు సాధనముల సమకూర్చి, సిఫారసులు చేయుటకై పూర్వపు హైకోర్టు న్యాయమూర్తి యగు కీ. శే. రాయ్ బాలముకుందుగారు ప్రత్యేకాధికారిగా నియమించబడిరి. వీరు దాదాపు ఒకటిన్నర సంవత్సరమువరకు పనిచేసి, ప్రభుత్వమువారికి, తమ నివేదికను సమకూర్చిన సాధనములసహా, పంపుకొనిరి. శాసన సభ్యుల సంఖ్య ౧౦౮ ఉండ వలయుననియు, వీరిలో సగము నియమింపబడిన (nominated) వారుగను, సగము సాధారణ నియోజకవర్గముల వలనను ప్రత్యేక నియోజకవర్గముల వలనను (General and Special Constituencies) ఎన్నుకొనబడిన వారుగను, ఉండ వలయుననియు, వీరు సూచించిరని చెప్పచున్నారు. మార్లేమింటో సంస్కరణముల (Morley-Minto Reforms) విధానము ననుసరించి బ్రిటిషిండియాలోని ప్రాంతీయ (Provincial) శాసనసభలకు ఏయేఅధికారములు, కర్తవ్యములు విధింపబడినవో, యించుమించు అట్టివే మన శాసనసభకును విధించుట బాగని వారు సూచించి నట్లు తెలియుచున్నది. వారు సమకూర్చిన సాధనముల ననుసరించి వోట్లిచ్చు హక్కులను గురించికూడ వారు సూచనలను చేసిరట. కాని వారి సూచనలకు తుది స్వరూపము ఏర్పడి, అవి అస్తిత్వమునకు వచ్చుట సంభవించ లేదు.

సుమారు మూడు సంవత్సరముల తరువాత, నవాబ్ సర్ నిజామత్ జంగ్ బహాదురు, నవాబ్ తిలావత్ జంగ్ బహాదురు, నవాబ్ సర్ హైదర్ నవాజ్ జంగ్ బహాదురు, రాజాబహాదురు కృష్ణమాచారిగార్లు సభ్యులుగాగల మరియొక కమిటీ స్థాపించబడి, పూర్వము సమకూర్చబడిన సాధనముల మరల పరిశీలించి, స్పష్టమగు ఒక స్కీము సిద్ధముచేయుటకై ఈ కమిటీ కాజ్ఞయైనది. ఈ కమిటీవారుకూడ నివేదికను, తమ సూచనలతోసహా, ప్రభుత్వమునకు పంపిరట. కాని నాటికిని నేటికిని అవి యటేయున్నవి! వాటికి తుదిస్వరూపము ఏర్పడి యుండలేదు!

## అధికారేతరుల యత్నములు.

ఈ మధ్యకాలమున, సంస్కరణములు కావలయునని స్వయంస్థాపిత(?)సంఘము (organized) గా గట్టిగా ప్రజలు అడుగుటకు వీలుకలగక పోయినను, ఎన్నియో సమావేశములందును మహాసభలందును ప్రజలు రాజ్యాంగ సంస్కరణములు కావలయునని తమ యభిప్రాయములను తరచుగా వెల్లడించుచునే వచ్చిరి. ౧౩౩౧ (౧౯౨౧) ఫసలీలో, హైద్రాబాదు స్టేటు రిఫారమ్సు అసోసియేషను (Hydorabad State Reforms Association) అను పేరుతో రాజ్యాంగ సంస్కరణల సాధించు నుద్దేశముతో నొక సంఘము స్థాపితమైనది. ఈ సంఘము వారు రాష్ట్రప్రజల యభిప్రాయములను, ఈ విషయమున, ఏకముఖమునకు దెచ్చుటకును, జనులలో ప్రబోధము కలిగించుటకును ఒక మహాసభ (Conference) సమావేశపరుప ప్రయత్నించి యుండిరి కాని ప్రభుత్వమువారు సెలవియ్యనందున ఆ యత్నము విఫలమైనది. అయినను ఆకాలమున అవసరములుగా దలపబడిన సంస్కరణముల వివరించుచు, ఆసంఘము వారు శాసనసభా విస్తరణమునకై యొక స్కీమును సిద్ధపరచి ప్రభుత్వము వారికి పంపిరి అంతేకాదు. ఈ కార్యముకొరకు ప్రముఖుల రాయబారమొకటి సదరు ఆజ్ఞముగారి వద్దకు వెళ్లియుండెను. పైనచెప్పిన రెండవ కమిటీ ఏర్పరుపబడినప్పుడు, ఒక బహిరంగ సభ సమావేశపరుపబడెను. ఈ సభ వారు మ. ఘ. వ. ప్రభువుగారికి తమ కృతజ్ఞతా భావమును తెలుపుచు, ప్రజాభిప్రాయమును వెల్లడించుటకు వీలుకలుగునట్లు కమిటీవారి నివేదికను ప్రకటించవలయునని ప్రార్థించిరి. కాని అట్టియవకాశము లభించ లేదు. ౧౯౩౧ లో సమావేశమైన నిజాం రాష్ట్ర రాజకీయమహాసభలో, బాధ్యతాయుత ప్రభుత్వము (Responsible Govt.) తుదిలక్ష్యముగానుంచి రాజ్యాంగ సంస్కరణముల ప్రవేశపెట్టవలయునని తీర్మానింపబడెను. రాజ్యాంగ మహాసభయొక్క స్థాయిసంఘము వారు, మ. ఘ. వ. ప్రభువుగారి రజతోత్సవ (Silver Jubilee) సందర్భమున, శాసనసభను విశాలపరచుటకై యొక విజ్ఞప్తిని ప్రభుత్వమునకు పంపుకొనిరి. ఇటీవల మన శాసనసభలోని నియమిత సభ్యుడగు (Nominated member) కాశీనాథ రావు వైద్యాగారు, ఇప్పుడున్న శాసనసభానియమావళిలో సవరణచేయుటకై యొక చిత్తుశాసనమును ప్రవేశపెట్టిరి. చిత్తుశాసనము విషయములో ప్రజలును, స్థానిక పత్రికలునుచూపిన తీవ్రమగు ఉత్సాహమును, గాఢమగు శ్రద్ధయు చూచినచో, రాజ్యాంగ సంస్కరణలకై వారికెట్టి కోరికలుండెనో విశదమగును. వైద్యాగారి చిత్తుశాసనములోని

సూచనలు అతి స్వల్పములుగానేయున్నను, వారికి కృతజ్ఞత దెలుపుటకై సమావేశములు, సభలు జరిగినవి. అభివృద్ధినందియున్న జనసంఘములమాట చెప్పనేల? ఆంగ్లోయిండియనులు, హరిజనులు మొదలగు అల్పసంఖ్యావర్గములు సహితము రాజ్యాంగ సంస్కరణములు తొందరగా జరుపవలయునని ప్రకటించుచు, వైద్యాగారి చిత్తుశాసనమునకు తమ యామోదమును దెలపిరి. పై చిత్తుశాసనమునకు విరుద్ధముగా నిమర్శన చేసినవారు సహితము సంస్కారములు కావలయునను భావముతోనే చేసిరి కాని వేరు కాదు. వేయేల? ప్రభుత్వమువారు వాగ్దానముచేసిన రాజ్యాంగ సంస్కరణములకు జనులు ఆతురతతో నిరీక్షించుచుండిరను సంగతి, జనులు, ప్రకటించినట్టి భావములకంటె, ప్రకటింపజాలకపోయినట్టి భావములవలన మరింత విస్పష్టముగా తెలియుచున్నదని చెప్పినచాలును !

## అయ్యంగార్ కమిటీ

నిజామత్ జంగ్ కమిటీవారు తమ సిఫారసులనుపంపి ౧౩ సంవత్సరముల కాలముగడచినప్పటికిని ప్రభుత్వమువారు ముందుకు సాగదలచలేదు. మహాఘనత వహించిన నిజాము ప్రభువుగారు "తరువాత ఈ సమస్యనుగురించి సదా అతురతతో ఆలోచనచేసి, జూబిలీ సంవత్సరము పూర్తికాకముందే ఈ విషయమున ప్రారంభ ప్రయత్నములు చేయవలయు" నని నిశ్చయించి, తదనుసారము, దివాన్ బహాదుర్ ఎస్. అరవముదు అయ్యంగార్. ఎం.బి.ఇ. (అధ్యక్షుడు), జి. యం. ఖురేషీ సా॥, కె. యస్. వైద్యాగారు, అక్బరలీఖాన్ సా॥, ప్రొఫెసర్ ఖాదరుహుసేన్ సా॥ సభ్యులుగా, అధికారులు అధికారేతరులు ఉభయులుకల, అనుభవ సహితమును స్వతంత్రము నునగు నొక కమిటీ ప్రభువుగారి ఫర్మానుద్వారా స్థాపింపబడెను. 'రాష్ట్రము యొక్క సందర్భములను, దాని యవసరములను, పరిస్థితులను దృష్టియందుంచుకొని, ప్రభుత్వమువారు ప్రజల యావశ్యకములను కోరికలను సదా తెలిసికొనుచుండుటకు వీలుండు విధమున, రాష్ట్రములోని వివిధ హక్కులవారి తోడి సాహచర్యము అధిక ఫలదాయకముగా ప్రభుత్వమునకు లభించుటకు, వేర్వేరు పక్షాంతరములను (Alternatives) అన్నిటిని విచారణచేసి నివేదించు'' నని ఈ కమిటీకి అప్పగింపబడినది.

కమిటీ స్థాపింపబడినదను ప్రకటన కొంత అసంతృప్తి కలిగించినట్లు వెంటనే పత్రికలలో కానవచ్చినది. కమిటీ కప్పగింపబడిన విషయములును, (Terms of

reference) కమిటీవారి సిఫారసుల అంగీకరించుటకుగాని నిరాకరించుటకుగాని చూపబడిన విధానము, (Procedure) జనులలో సర్వసామాన్యముగా తీవ్రమగు నిరాశనుకలిగించినవి. కమిటీయొక్క కార్యముల ఆవరణమును, (Scope) విధానమును చాల సంకుచితములుగా నుండెను. అయినను, సాక్ష్యము తీసికొనుటకు ఏ విధమైన ప్రత్యేక పద్ధతియు నిర్ణయించకపోయినను, కమిటీవారు ప్రజల విజ్ఞప్తులను తీసికొనవచ్చునని మాత్రము ప్రభుత్వమువారు తరువాత ఆజ్ఞాపించిరి.

పైన వివరింపబడిన ప్రకారము, హైదరాబాదు రాష్ట్రపు రాజ్యాంగ సంస్కరణముల కథ, అతి ఆలస్యము యొక్కయు, విఫల ప్రయత్నముల యొక్కయు గాథ. ఈ యంశము మ. ఘ. వ. ప్రభువుగారికి పూర్ణముగా విశదమై యుండినందున, వృద్ధికనుకూలమగు ఏయే సంస్కరణములు ప్రారంభించవలయునో వానిని ఆలస్యము లేకుండ సత్వరముగా ప్రవేశపెట్టవలయునని సంకల్పించి, కమిటీపని శీఘ్రముగా జరుపుట అవశ్యకమని దయా పూర్వకముగా సెలవిచ్చిరి. మా కమిటీవారు మ.ఘ.వ. ప్రభువు గారి దయాపూరితమగు సందేశమునకును ఆజ్ఞకును కృతజ్ఞత దెలుపుచు, శ్రీవారియెడను ఆసిఫ్‌జాహీ వంశమునెడను మాకుగల అకుంఠిత రాజభక్తిని ప్రకటించుచున్నారు.

(ఆ) ఎదుర్కొనుచున్న సమస్యలు.

బాధ్యతాయుత ప్రభుత్వము.

రాజ్యాంగ సంస్కరణములను గురించి ఆలోచించు సమయమున కొన్ని ముఖ్యాంశములను మనము దృష్టియందుంచుకొన వలసియున్నది. మొట్టమొదటి యంశమేనగా, రాజ్యాంగ విధానమనునది, తటాలున నిర్మించదగినదికాదు; అది క్రమవికాసము పొందునది. నూతనముగా సిద్ధపరుపవలసిన ఏ ప్రణాళికయైనను సరే, దేశముయొక్క చారిత్రిక స్థితిగతులను, సంప్రదాయములను బట్టి, క్రొత్తగా కలిగిన అవసరములకును, సంఘటనలకును అనుగుణ్యమగు విధమున ఏర్పరుప బడవలయును. ఈ రాష్ట్రమున రాజ్యాంగ విషయికములగు కొన్ని పరిణామములును, మరికొన్ని యుద్యమములును ఉద్భవించినవి. ముఖ్యముగా అధికారులవైననేమి, అధికారేతరుల వైననేమి, అనేక సభలు, సమావేశములు జరిగినవి. మనరాష్ట్రములో, ఒక శాసన సభయు, పురపాలక సంఘము (Municipal Corporation) లోకల్బోర్డుల

సంఘములవంటి స్థానిక స్వపరిపాలన సంస్థలు, ప్రారంభరూపముననున్న వేయగుగాక, పూర్వమే ఏర్పడినవి. అన్నిటికంటె మించి, రాష్ట్రముపైన సర్వాధికారముగల రాజన్యత్వము(Sovereignty) సంప్రదాయానుసారము రాజ్యాంగమునకు మూలపీఠముగా సుస్థిరమైయున్నది. కనుక మనము నిర్మింపబోవు క్రొత్త కట్టడములన్నియు ఈ బునాదుల పైననే నిర్మితములు కావలసియున్నవి. ఈ కార్యమున, గ్రామములోని ప్రజలకుగల రాజకీయములను గురించిన జ్ఞానమును దాని శక్యతను గ్రహించవలయును. ఈ కమిటీ వారు తత్త్వమును గురించి గాని పాలిసీని గురించి గాని నిర్ధారణచేయుటలో ఈ సమస్యలనన్నిటిని పరిష్కరించ వలసినవారైరి.

ఇట్టి సమస్యలుండనేయుండ, ఇంతకు మించిన గహన సమస్యలను కొన్నిటి నెదుర్కొన వలసివచ్చినది. పరిషత్తువారి వలన ఈ కమిటీ కప్పగింపబడిన విషయము (Terms of Reference) లలో ''బాధ్యతాయుత ప్రభుత్వము'' అను శబ్దములను గూర్చి అభిప్రాయమియ్య వలయునను విధి లేకపోయినను, ఈ శబ్దముల భావమును వ్యక్తముచేయవలసిన పరిస్థితులు కొన్ని సంభవించినవి. ఈవిషయమున కమిటీవారిపైన తీవ్రవిమర్శనలును, స్వార్థసహితమగు ప్రచారమును కొంత జరిగినదను సంగతి రహస్యముకాదు. రాజుయొక్క అధికారములు స్థిరముగా నుండవలసియున్నచో, ఏరూపముననైనను సరే, బాధ్యతాయుత ప్రభుత్వము కావలయునను భావమునకు తావే ఉండజాలదు అని కొందరు వాదించిరి. ఇట్టి పొరపాటును (దీనినిగూర్చి వేరొక చోట వివరింతుము) తొలగించుటకై కమిటీవారు ఈ క్రింది ప్రకటనమును స్థానిక పత్రికలలో వెలువరించ వలసినవారైరి.

"హైద్రాబాదు ప్రజాపరిషత్తువారు కమిటీకి అప్పగించిన విషయములలో ఉపయోగింపబడిన 'భాద్యతాయుత ప్రభుత్వము' అను శబ్దముల అర్థము కొందరు తప్పుగా గ్రహించుచున్నారు. ఇది విచారకరము. అప్పగించబడినిన విషయములలో, వాడబడిన పై శబ్దములకు అర్థమిది. రాష్ట్రముయొక్క కార్యనిర్వహణాధికారులు మ. ఘ. వ. ప్రభువుగారికి ఎప్పుడును బాధ్యులుగానుండుచు, శాసన సభకుకూడ జవాబుదారులై యుందురు. శాసన సభ తుదకు ప్రభువుకు జవాబుదారీ వహించియుండును. ఇట్టి జవాబుదారీయొక్క విధము, వైశాల్యము మ.ఘ.వ. ప్రభువుగారి వలన నిర్ణయింపబడుచు, మార్పబడుచునుండవచ్చును. ఈ విధమైన ప్రభుత్వమునకే 'బాధ్యతాయుత

ప్రభుత్వము' అను శబ్దములు వర్తించుచున్నవి. మన రాష్ట్రపు బాధ్యతాయుత ప్రభుత్వము ఎట్టి స్వరూపమునవైనను సరే, మ. ఘ వ. నిజాము ప్రభువుగారియొక్కగాని ఆసఫ్‌జాహి వంశముయొక్కగాని రాజాధికారములను లేక హక్కులను తగ్గించుటయనిగాని, తొలగించుటయనిగాని ఆక్రమించుటయనిగాని పై శబ్దముల కెప్పుడును అర్థము కాదు; కాజాలదు. కనుక, పరిషత్తుయొక్క సూచనలు స్పష్టముగా వెలువడునంతవఱకు ప్రజలు నిరీక్షించవలయుననియు అటు తరువాత యభిప్రాయముల స్థాపింపవలయుననియు, ముందుగానే పొరపాటులకు, సందేహములకు, అపోహలకు లోబడకుండవలయుననియు కోరుచున్నాము.''

## రాచరికము; బాధ్యతాయుత ప్రభుత్వము.

హైద్రాబాదు రాష్ట్రముయొక్క ప్రభువు, కార్య నిర్వాహణమునకు ముఖ్యాధిష్ఠాతయు (Superme Executive Head) ను, శాసనములకు మూలాధారుడును అనుమతి నిచ్చువాడును అయియున్నాడు. అనగా మనది ఏకైక రాజ్యాధిపత్యము (Unitary State) - ఇట్టి రాజ్యాంగములో, రాజు, జనులయొక్క స్వాతంత్ర్యమునకు ప్రత్యక్షముగాను మూలాధారముగాను, ప్రతినిధియై యుండినందున, ప్రజాపరిపాలనయొక్క అంగమగు కార్యనిర్వాహణాధికారులను నిర్మించుటకును, తొలగించుటకును, రెండువిధములుగను అధికారమును నడుపగలిగియుండును. కనుక పాలకుడగు రాజునకు శాసన సభలకుకంటె, ప్రజలతో ఎక్కువసూటిగను, ఎక్కువ ముఖ్యముగను సంబంధము కలిగియుండును. రాజకీయ పరిస్థితులయొక్క పరిశుద్ధతను, సరితూకమును నిలిపియుంచుటకై రాజునకుగల సర్వాధికారమును రాజ్యాంగసంఘములో కలుపవలసియుండును. కాలముయొక్క ఈయవసరమును మ ఘ.వ. ప్రభువుగారికంటె ఎక్కువగా గ్రహించినవారింకొకరు లేరు. కనుక నేవారు ౧౩౩౮ హిజ్రీలో దయాపూర్వకముగా జారీచేసిన ఫర్మానులో ఈ క్రింది వాక్యముల సెలవిచ్చియుండిరి. ''ప్రజాక్షేమము కొరకగు ఏ పెద్ద స్కీమునైనను జయప్రదముగా సాగించవలయునన్నచో ముఖ్యమగు షరతు ఒకటి కలదు. అదేదన, ఎవరికొరకు పరిపాలనము ఉద్దేశింపబడియున్నదో వారి యవసరములకు అనుగుణ్యముగా పాలనాపద్ధతులుండవలయును. ఏలయనగా సత్పరిపాలన యొక్క రీతి రాజ్యాంగవిధానముపైన నాధారపడియుండును కాని రాజుయొక్క వ్యక్తి సంబంధమగు యోగ్యతలపైన కాదు.'' ఈ ఫర్మాను, ప్రజలకు

"సత్పరిపాలనావసరములకు అనుగుణ్యముగ కొంత అధికారమును." ప్రసాదించి యుండెను. అంతేకాదు. ఈ ఫర్మానులోనే, "అందరియొక్క సౌఖ్యసౌభాగ్యముల పెంపొందించుటయను సమిష్టిధర్మము నెరవేర్చుటకై అధికారులకును అధికారేతరులకును మధ్య పూర్వముకంటె ఎక్కువ సహకారముకలుగు నవకాశములు కలిగించబడు" నని వాగ్దానముచేయబడినది. ఇటీవల ప్రభుత్వమువారుచేసిన ప్రకటనలో "ప్రజల యొక్క అవసరములను కోరికలను ప్రభుత్వమువారు, ఎడతెగకుండ, తెలుసుకొను చుండుటకు" వీలగునట్లు స్కీమును సిద్ధపరచుటకై ప్రభుత్వమువారు, కోరబడి యున్నారు. ఈ ప్రకటనకు అర్థమేమి? ముఖ్యాధిష్టాతయగు రాజునకును జనులకునుగల యైక్యత ఇప్పుడున్నదానికంటె ఎక్కువ దృఢముగను ఎక్కువ క్రియాపూర్వకముగను ఉండవలయుననియు, పై వారిద్దరికి నడుమ ఎట్టి యంత్రము ఆటంకము కలిగించునదిగా నుండగూడదనియు దాని యర్థము.

" వంశపారంపర్యమున ఏర్పడు రాజు మూలవిరాట్టుగానుండు ఏకైక రాజ్యాధిపత్యమునందు, బాధ్యతాయుత ప్రభుత్వము అను భావమునకే వీలులేదు" అని కొందరు తరచుగా విమర్శన చేయుచున్నారు. ఇట్టి విమర్శనము చేయువారు, 'పరిస్థితులెట్లుండినను సరే, బాధ్యతాయుత ప్రభుత్వము అన్ని చోట్ల ఒక విధమైనదిగానే ఉండును' అను సూత్రమును బునాదిగా నుంచుకొని విమర్శనచేయుదురు. మేమిట్టి సూత్రముతో నేకీభవించము.

పూర్వదేశములన్నిటిలోను — ముఖ్యముగా, హిందూదేశములో — రాజులవలన పాలింపబడుచుండిన ఏకైక రాజ్యాధిపత్య ప్రభుత్వములేయుండెను. ఈ రాజులు, ధర్మ (న్యాయ)మూర్తులుగనుండిరి. రాజునందు కేంద్రీకృతమైన ఈ ధర్మము వికాసముచెంది ప్రజాసంఘములలో నిమిడి సుస్థిరమై, అట్టి సంఘములద్వారా పరిపాలనాకర్తవ్యముల నిర్వహించుచుండెను. ఇట్టి ప్రజాసంఘములు (గణములు) సహితము పూర్వకాలమున నుండెననియు, అవి కార్యనిర్వహణాధికారులపైనను, ప్రభుత్వముయొక్క ముఖ్యాధిష్టాతపైనను దృఢముగా నధికారము చెలాయించుచుండెననియు చరిత్రవలన బాగుగా రుజువగుచున్నది. ఇట్టి సంస్థలు కాలక్రమమున దురుపయోగముపాలై, హిందూదేశరాజ్యాంగపు బునాదుల దుర్బలపరచివేసెను. ఆ కాలపు అధికార విభజన సహితమును (decentralized), స్వాతంత్ర్యయుతమును

(autonomous) నగు పరిపాలనాపద్ధతి, యిప్పటికిని, చాల నూటలు ఆకారముతో గ్రామపంచాయితీల రూపమున, మన అదృష్టవశమున, నిలిచియున్నది. ఈవిధముగా, ప్రజలయొక్క సమిష్టియుద్దేశము, రాష్ట్రముయొక్క ముఖ్యాధిష్ఠాత యుద్దేశముతో భేదభావములేకుండ కలసిపోవుటవలననే రాజుయొక్క ప్రతినిధిత్వము ఎక్కువ యదార్థమైనదిగను, ఎక్కువ వాగ్వ్యక్తము (articulate) గను ప్రజా ప్రయత్నముపైన నాధారపడినదిగను ఉన్నది. పాలకపాలితులయందు ఇట్టి యైకమత్యముండుటయే భారతవర్షముయొక్క రాజనీతి కోవిదులగు పురాతన ఋషి సత్తముల యుద్దేశమైయుండెను! అట్టి యుద్దేశమే సఫలమైయుండెను!

కావున, ఏకైకరాజాధిపత్యమున, బాధ్యతాయుత ప్రభుత్వపద్ధతి ఉండుటకు వీలులేదనుట సరికాదు. ఇంగ్లీషువారు చెప్పునట్టి సంకేతార్థమున, నిక్కచ్చిగా బాధ్యతాయుత ప్రభుత్వము అనునది యుండజాలదనుట మాత్రము వాస్తవము. వారు చెప్పుపాలనాపద్ధతి ద్వంద్వపద్ధతిపైన నిర్మింపబడినది. అది హైందవాభావ నంటి ఏకైకరాజాధిపత్యమునకు అనుగుణ్యముగ నుండజాలదు. అయినను, రాష్ట్రము యొక్క ముఖ్యాధిష్ఠాతవలన ఏర్పరుపబడినట్టి కార్యనిర్వాహకులు ప్రజాభిప్రాయము నకుగూడ గట్టిగా బాధ్యులై యుండునట్లు చేయుటకు మార్గములను కనిపెట్టుట అసంభవముకాదు. ఏలయనగా, ౧౯౧౯ సం॥ లో సి. శంకరన్ నాయర్ గారు ఇండియా ప్రభుత్వమువారి విజ్ఞప్తిలో వ్యతిరేకించుచు అభిప్రాయముగా (Minute of Dissent to the Govt. of India Despatch of 1919) వ్రాసిన ప్రకారము, "బాధ్యతాయుత ప్రభుత్వము" అనగా ప్రజాప్రతినిధులవలన ఏర్పడిన శాసనసభకు కార్యనిర్వాహణాధికారులు లోబడియుండుటయే. కనుక ప్రభుత్వాధికారులు శాసనసభవలన నియమింపబడినవారైనను, కాకపోయినను, ఈ యుద్దేశము నెరవేర్చుటలో ఎక్కువ భేదముండదు. ముఖ్యమగు విషయము ఏమనగా, అట్టి అధికారులు శాసనసభవారి యుద్దేశములను ప్రతి విషయమునందును పాలించి తీరవలయును." యదార్థము విచారించినచో, ఇట్టి యుపాయములవలననే కార్యనిర్వాహణాధికారులపైన రాజు యొక్క అధికారము దృఢతరమై ఎక్కువ ప్రభావవంతముగా నుండగలదు. ఇట్టి పద్ధతిలో, మంత్రులు రాష్ట్రముయొక్క ముఖ్యాధిష్ఠాతయగు రాజునకు చెప్పు ఆలోచనల విషయమునను, చెప్పక ఉపేక్షించిన విషయములలోను జవాబుదారులై యుందురు. అట్లే, ప్రజాప్రతినిధిసభల యొక్క పై పెత్తనమునకు కూడ లోబడి

యుండగలరు. పరిపాలనా విషయములలో కొంత అధికారవిభజనము నిస్సంశయముగా ఉండితీరును కాని రాజునకు ప్రజలకును గల యైకత్యకు మధ్య ఉద్యోగస్తుల పరిపాలనము అటంకముగా నుండగూడదు. మంత్రులు ప్రజలకు ప్రత్యక్షముగా జవాబుదారులై యుండు స్థితులలో, వారు, అప్పగింపబడిన కొన్ని అధికారములకు కేంద్రమువంటివారలై, ప్రజల సాధారణ హక్కులకు విరుద్ధముకాకుండ నుందురు. అట్లు కాక, ప్రజలకు భాధ్యులుకాకుండనుండు మంత్రి వర్గము, స్వతంత్రముగా నప్పగింప బడిన గొప్ప అధికారములకు కేంద్రమై, రాజునకును ప్రజలకునడుమ అడ్డుగా నిలువ గలదు. కనుక, ఏకైకరాజ్యాధిపత్యముగల పరిపాలనా పద్ధతిలో, గొప్ప అధికారములు ఏవి అప్పగింపబడవలయునో, అవి ప్రజలకు ప్రాతినిధ్యము వహించిన సంఘములకు సభలకు మాత్రమే అప్పగించబడవలయును; మరియు రాజువలన నియోగింపబడిన కార్యనిర్వాహణాధికారులు అట్టి సంఘములకు సభలకు వాని యుద్దేశముల ప్రకార ము నడచుకొనునట్లు జవాబుదారులై యుండవలయును. ఈ వివరములను దృష్టియం దుంచి చూచినచో, కొందరు అనుకొనునట్లు, మన రాష్ట్రములో భాధ్యతాయుత ప్రభుత్వము ఉండనే వీలులేదనువాదము సరికాదు.

## కాలముయొక్క పోబడి.

దయామనములగు మన ప్రభువుగారి గత యిరువది సంవత్సరముల పరి పాలనకాలములో కలిగిన విద్యాభివృద్ధియు సాంఘికాభివృద్ధియు సాటిలేనివి. ఈ కొంతకాలమున జరిగిన యభివృద్ధి అంతకు పూర్వము ఒక శతాబ్దకాలములో కూడ జరిగియుండలేదని చెప్పినచో, అతిశయోక్తి కాదు. దీనికి కారణము చాలవరకు ప్రజలక్షేమమును గురించియు, రాష్ట్రముయొక్క వికాసము విషయమునను మన ప్రభువు గారు స్వయముగాచేసిన శ్రద్ధయేకాని వేరుకాదు. ప్రజాప్రభుత్వ భావముల వ్యాపింప జేయుటలో విద్యావ్యాప్తియే ముఖ్యసాధనము. మధ్యయుగములనాటి పాతఫ్యూడలు పద్ధతులు మార్పుచెందినవి. జీవితముయొక్క ప్రతి యంతస్థులోను సమీకరణ పద్ధతి స్పష్టముగా కానవచ్చుచున్నది. మన దేశములోని యువజనులు, ప్రపంచములోని యితరప్రాంతములలో గల ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులతో దినదినము అధిక మగు సంబంధము కలుగువారగుచు, అన్ని ప్రాంతములలోను, పౌరస్వత్వపు భాధ్యత (Civic responsibility) యొక్క సారమును గ్రహించ నారంభించినారు.

సాధారణముగా విద్యార్థికులును, ముఖ్యముగా మన విశ్వవిద్యాలయ విద్యార్థులును ప్రజాసంబంధమగు ఉద్యమములందును, పౌరస్వత్వ సంబంధమగు విషయములందును చూపుచున్న తీవ్రమగు నుత్సాహమును కుశాగ్రబుద్ధిని సాధించినట్టి గతకాలపు పోబడి విస్పష్టముగా తెలియగలదు. బ్రిటిషుహిందూ దేశమందును, ఎంత చిన్నవైనను కొన్ని దేశీయరాజ్యములందును, సాగుచున్న రాజకీయాందోళనలు ఈ రాజ్యములో నివసించువారి భావములను అభిప్రాయములను, సహజముగనే, మార్పకుండజాలవు. మన చుట్టుప్రక్కలను చెలరేగుచున్న భావప్రవాహములు, మనోరథతరంగములు మనరాజ్యమును తాకకుండ దూరముగా తొలగియుండునని మనము భావించుచు సంతోషించుచుంటిమేని అది ఆత్మవంచనమే యగును.

ఇట్టి భావతరంగములు మన రాష్ట్రముయొక్క రాజకీయ జీవితమున చెలరేగు చున్నట్టు బాగుగా కనుపడుట లేదనుకొంటిమేని, నవీనశక్తులయొక్క తీవ్రతను, లోతును సరిగా గ్రహించినవారము కాజాలము. మన రాష్ట్రములోని ప్రజలందు రాజకీయ విజ్ఞానము హృదయములలో గర్భితమైయున్నది కాని ప్రకటనమునకు వచ్చుచుండలేదు. కారణమేమనగా, మనోభావముల ప్రకటించుటకు అవకాశము లిచ్చుట లేకపోవుటయే 'వాక్స్వాతంత్ర్యము విషయములోను, సమావేశ స్వాతంత్ర్యము విషయములోను మన రాష్ట్రములోని ప్రజలకు విధింపబడిన నిర్బంధముల వలన జనుల కోరికలు బయటబడుటలేదు. అంతేకాని రాజకీయ విషయిక విజ్ఞానములేక కాని రాజకీయముల విషయమున అభిరుచిలేక కాని కాదు!

జనుల స్థితిగతులు:

గడచిన యిరువదియైదు సంవత్సరముల కాలములో మన రాష్ట్రమునకు కలిగిన అద్భుతమగు నభివృద్ధిని గురించి వెనుక చెప్పియున్నాము. ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనమును దాని మూలమున చాలమందిలో ఉన్నతవిద్య వ్యాపించుటయు దేశమునందు అంతటను గొప్ప ప్రబోధము కలిగించినది. జనసమాన్యము నందు విద్యవచ్చినవారి సగటుసంఖ్య యింకను తగినంతఎక్కువగాలేదు కాని, ఉన్నత విద్యను ప్రభుత్వమువారు ఎక్కువగా ప్రోత్సహించిన కారణమున, పౌరస్వత్వపు హక్కులను,జవాబుదారీలను నిజముగా గ్రహించగలిగిన విద్యార్థికులవర్గము ఒకటి గొప్పది

ఏర్పడినది. ఇట్టి విద్యాధిక వర్గము దేశమ్ములోని వివిధ ప్రాంతములందును క్రమముగా వ్యాపించుచున్నది. సగటున ప్రతిసంవత్సరము దాదాపు ౧౦౦౦౦ మంది యువకులు హైస్కూలు పరీక్షలలో నడతేరుచున్నారు. కాలేజీలనుండి ప్రతిసంవత్సరము బయలుదేరుచున్న పట్టభద్రులు (Graduates) ప్రతిసంవత్సరము విద్యాధిక వర్గమును ఎక్కువ బలపరచుచున్నారు. వీరికి వచ్చిన విద్య సార్థకమేమైనచో, వీరందరు, జీవితముయొక్క ఏ అంతస్థులోనైనను సరే, జవాబుదారీగల గట్టి పౌరులు అయి తీరుదురు!

గడచిన పది సంవత్సరముల కాలములో మన ప్రజలయొక్క ఆర్థికస్థితి చాల నిరాశాజనకముగను, నిరుత్సాహకరముగను ఉన్నదని చెప్పక తప్పదు. బయటినుండి వచ్చి పోవువారికి మన దేశము భాగ్యవంతముగాను సుభిక్షముగాను ఉన్నట్లు పైకి కానవచ్చును. కాని, రాష్ట్రప్రజలలో అత్యధిక సంఖ్యాకులగు వ్యవసాయకుల దుర్భర దారిద్ర్యమును ఎవరు లేదనగలరు? ఈ సామాన్య జనులకు ఉండిన పూసపోగు అంతయు ఏ విధమున అయిపోయి వారు నిస్సహాయస్థితియందున్నారో చూపుటకు అంకెలతోగాని, మర్దుంపువారీ లెక్కల వివరములతోగాని పనిలేదు. పాపము! ఈ పేదసాదలు ఎంత దౌర్భాగ్యస్థితికి పాలుపడియున్నారో, తరచుగా వచ్చుచున్న కరువులు, ప్రభుత్వమువారివ్వవలసి వచ్చుచున్న మాల్గుజారీ మాఫీలు స్పష్టముగా రుజువు చేయుచున్నవి. వారిలో కొందరు అనుకొనుచున్నట్లు, ఈస్థితి కొద్దిలో వెడలిపోవునట్టిదికాదు. 'పరిపాలనా పద్ధతియొక్క బునాదిలోనే ఏదో యొక లోపమున్నది'యని గ్రామప్రజలు మెల్లమెల్లగా నైనను గట్టిగానే గ్రహించుచున్నారు. పరిపాలనావిధానముకూడ తలబరువు కలదై (Top-heavy) దుస్సాధ్యము అగుచు వచ్చుచున్నది. బజెటు (మవాజనా)లో ప్రతి సంవత్సరము అన్ని శాఖల (సిరస్తాల) కొరకును ధనము ఉదారముగా మంజూరు చేయబడుచున్నప్పటికిని, జాతీయ నిర్మాణశాఖల (Nation Biulding Departments) వలన నికరముగా అగుచున్నపని జనులు పెట్టుకొనిన ఆశలలో కొద్ది మేరవరకైనను నెరవేరుచుండలేదు. పరిపాలనాయంత్రము ఎంత క్లిష్టముగను, చిక్కులతో గూడినదిగను ఉన్నదనగా, గ్రామస్థులకు ప్రతిదిన జీవితములో కలుగుచున్న అవసరములను తీర్చుకొను కార్యము ఎందరో అధికారులవద్దకిని, ఎన్నియో కచ్చేరీలకును, ఇక్కడినుంచి అక్కడికి అక్కడనుంచి ఇక్కడికి, ఉరుకులు పరుగులు పెట్టకుండ వేగముగా

నెరవేరుటలేదు. ప్రభుత్వకార్యాలయములలో సర్వసాధారణముగా జరుగుచుండు ఆలస్యమువలన గ్రామస్థులు వానినుండి మరింతదూరము అగుచున్నందువలన అసలు ఉద్దేశమునకే భంగము కలుగుచున్నది.

ఈ కారణములన్నియుకూడి జనసామాన్యముయొక్క మనస్సులందు అస్పష్టమైనను గట్టిదగు ఒక అభిప్రాయమును, స్థాపించినది. అదేదనగా, కష్టసుఖముల నివారణ కావలసియున్నచో వాటినిగురించి, ఎన్ని సారులు వీలైతే అన్ని సారులు ఎడతెగకుండ మొరపెట్టుకొనవలయుననునదే. వాక్స్వాతంత్ర్యమునకును, సమావేశ స్వాతంత్ర్యమునకును ఎన్నియో నిర్బంధములు ఉన్నను వారు దినదినము హెచ్చుగా మొరపెట్టుకొన నారంభించి యున్నారు. దురదృష్టమువలన ఏర్పడిన ఈ నిర్బంధములు జనుల భావములను, పైకి బాగుగా ఉబకనీయక, మనస్సులలో అణచి పెట్టుచున్నవి. ఎన్నియో షరతులు, నిర్బంధములు విధించ బడినప్పటికి రాష్ట్రములోని మూడు (ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక) ప్రాంతముల మహాసభలలో జరుగుచున్న చర్యలు, ఆయా ప్రాంతపు జనుల యోగక్షేమములకును వారి యభివృద్ధికిని సంబంధించిన విషయములను బయటపెట్టుచు వారియొక్క ముఖ్యావసరమును పూర్తి చేయుచున్నవి.

"మన రాష్ట్రపు ప్రజలలో రాజకీయ విషయిక జ్ఞానము, తర్ఫీదు తగినంత లేదు; కనుక ప్రస్తుత స్థితిలో ఏ మాత్రపు రాజ్యాంగ సంస్కరణాలు ప్రవేశ పెట్టబడినను వారు వానిని బాగుగా నుపయోగించుకొనజాలరు" అని కొందరు విమర్శకులు ఊహించవచ్చును. హైదరాబాదు రాష్ట్రపు ప్రజలకు ఇంతకుముందు రాజకీయ సంస్కరణములను ప్రతినిధి సంస్థల మార్గమున ఉపయోగించుకొను అలవాటు కలుగలేదనుమాట నిజమే. అయినను, మన రాష్ట్ర ప్రజలకు మంచి ప్రపంచ జ్ఞానమును జాగ్రత్తతో గూడిన వ్యవహార నిపుణతయు కలదనియు, పౌరస్వత్వముల సంబంధమగు తర్ఫీతుకు ఈ యోగ్యతలే మూలాధారములనియు, ఈ రాజ్యమునందలి జనులు వివిధములగు ఉద్యమములలో చూపుచున్న కార్యకౌశల్యమునందలి అనుభవమును బట్టి మాకు నమ్మకమున్నది. అవసరమైన అవకాశములును, పరిస్థితులును కల్పింపబడినచో హైదరాబాదు వాసులు, పౌరస్వత్వ సంబంధమగు ఎంతటి గొప్ప కర్తవ్యములనైనను, సామర్థ్యతతోను, యోగ్యముగను నిర్వహించుటలో బ్రిటిషిండియాలోని సోదరులకు ఎంతో వెనుక బడరనుట నిశ్చయము.

## బ్రిటిషు హిందూదేశము — హైదరాబాదు రాజ్యము

హిందూదేశమున కంతటికిని సమానముగ వర్తించునట్టి సాంఘిక, ఆర్థిక సమస్యలు ముఖ్యమైనవికలవు. అట్టివానిని పరిష్కరించుటకై జరుగుచున్న ప్రయత్నములతోపాటు హైదరాబాదు రాజ్యముకూడతన పాలు సహకారము చేయ వలసియే యుండును. అయినను బ్రిటిషు హిందూదేశములోనున్న రాజకీయ సమస్యలు ప్రత్యేక స్వభావము కలవియగుటవలన అవి యిక్కడ ఉద్భవించవు. మన రాష్ట్రమున రాజుయొక్కయు ప్రజలయొక్కయు లాభనష్టములు పూర్తిగా సమానములు; వానిని విడదీయుటకు వీలులేదు. దేశీయ రాజ్యముల ప్రజల నెదుర్కొనుచున్న సమస్య, పరదేశీయమును ఇష్టములేనిదియునగు ఉద్యోగవర్గమునుండి అధికారము ఊడ గుంజుకొనుట కాదు; అభివృద్ధి మార్గములకును కాలముయొక్క పోబడికిని అనుగుణ్యమగు విధయున రాజ్యాంగ యంత్రమును తగినట్లు సవరించుకొనుటయే. కనుక బ్రిటిషు హిందూదేశములో రాజకీయ స్వాతంత్ర్యము కొరకు జరిగిన కలహముల నాటక రంగములు ఇచ్చట ప్రదర్శింపవలసిన పని ఏమాత్రములేదు. అట్టి వానిని ప్రభుత్వమువారు గాని ప్రజలుగాని తలంపగూడదు. హిందూదేశములోని అనేక ముఖ్య సంస్థానములలో ఇంతవరకును కౌన్సిలు పరిపాలనలో ఆరంభ సంస్కరణముల కంటె ఎక్కువ అధికారములు ఇయ్యబడలేదను కారణమును మనసులో నుంచుకొని అన్నిటికంటె గొప్పదగు మన రాజ్యమున అట్టి సంస్థానముల తప్పుమార్గమును అవలంబించుటకూడదు. ఉదారముగా రాజకీయ సంస్కరణములు ప్రవేశ పెట్టబడిన పక్షమున దేశస్థితి బలపడుటయే కాక, రాజ్యము శాంతతతోను, ఐకమత్యముతోను, వృద్ధి పొందుటకు మార్గము ఏర్పడగలదు.

పైనచెప్పిన మాటలవలన, ఈ కమిటీవారు, జాగరుకతతో మెల్ల మెల్లగా అభివృద్ధి చెందుట క్షేమకరమని వాదించు శిష్టాచారుల అభిప్రాయమునకు ప్రాముఖ్యము ఇచ్చుటలేదని తలచగూడదు. కమిటీవారు, అన్ని సమస్యలను వివిధ దృక్పథములనుండి బాగుగా ఆలోచించి, మరల మరల పరిశీలించి యున్నారు. కమిటీలోని కొందరు సభ్యులయొక్కయు, ఇతర ప్రజలయొక్కయు జాగరూకతతో గూడిన భావములకు తగిన ప్రాధాన్యతనిచ్చియే, తగినంత మితవాద పద్ధతి నవలంబించియే సిఫారసులను చేసియున్నారు. రాబోవు పుటలలోగల సంగతులను జూచిన మీదట, కమిటీ వారెట్టి భావముతో నీ సమస్యలను సమీపించిరో రుజువుకాగలదు.

## రాజ్యాంగ వ్యవస్థ యొక్క వికాసములు - అంతరంగికము; బాహిరంగికము.

రౌండు టేబిలు కాన్ఫరెన్సు (Round Table Conference) జరిగిన తరువాత, బ్రిటిషిండియా రాజ్యాంగ వ్యవస్థలో కలిగిన యభివృద్ధి వలన మన రాష్ట్రము యొక్క రాజ్యాంగ వ్యవస్థ యొక్క అంతరంగిక బహిరంగిక సమస్యలన్నిటిపైన నిండు ప్రత్యక్షముగా ప్రభావము కలిగినది. రౌండు టేబిల్ కాన్ఫిరెన్సులో జరిగిన చర్చలందు మన రాష్ట్రము పాల్గొనుట వలనను, అఖిలభారత ఫెడరేషను పద్ధతి 'రాజకీయముగా ఆచరణ యోగ్యమే' యని మన ప్రతినిధులు ఒప్పుకొని యుండుట వలనను సహజముగనే కొన్ని రాజకీయ పరిణామము లేర్పడినవి. మన రాష్ట్రమునకు సంబంధించు ఫెడరేషనును గూర్చి మేము మా యభిప్రాయము తెలుప దలచుకొనలేదు; ఏల యనగా, మా కమిటీకి అప్పగింపబడిన విషయములలో ఈ విషయమును గూర్చి అభిప్రాయము తెలుప వలయునని విధింపబడి యుండలేదు. ఈ సందర్భమున మేము సూచించ దలచిన దేమనగా, ఫెడరేషను విషయమే మన రాష్ట్రపు ప్రజలందు, ఇదివర కెప్పుడును కలిగియుండని రాజకీయ ప్రబోధమును ఉద్భవింప జేసినది. పూర్వము రాజకీయములను గురించి పూర్తిగా నిర్లక్ష్యభావముతో నున్న ప్రజలు ఫెడరేషను వలన కలుగబోవు రాజ్యాంగ, అర్థిక, రాజకీయ ఫలితములను తెలిసికొనుటకు కుతూహలు లైనారు. ఇట్టి ఫలితములలో నొకటి ఏదనగా, మన రాష్ట్రములో ప్రజా ప్రాతినిధ్యముగల సంస్థల స్థాపనమును పరిపాలనలో ప్రజలకు జోక్యము కల్పించుటయు ఇక తప్పదనుటయే. హైదరాబాదు నగరములోని రెసిడెన్సి ప్రాంతము మన కప్పగింప బడుటయు(rendition of the Administered Areas,)ఇండియా ప్రభుత్వము వారికిని మన ప్రభుత్వమువారికిని బీరారు ప్రాంతము విషయమున కరారు జరుగుటయు, మన చుట్టు పట్టులనున్న బ్రిటిషిండియా ప్రాంతములతో మనము సమాన దశకు వచ్చుట అవసర మని మరింత ధృవపరచినవి. ఇతర దేశీయ సంస్థానములలో నిటీవల అభివృద్ధి మార్గములు అవలంబించ బడుచున్నవి. వానిలో ననేకములందు ఇప్పుడు శాసన సభలు, ఆసెంబ్లీలు, ప్రజా ప్రతినిధులు కలవై పని జరుపు చున్నవి. మరికొన్ని చిన్న సంస్థానములలో కూడ, (అవి మన రాష్ట్రములోని కొన్ని పెద్ద జాగీరు యిలకాలతో సమాన దశకలవియే యైనను) ప్రజా ప్రతినిధి సంస్థలు ఏర్పడి, తృప్తికరముగా పనిచేయుచున్నవి. కనుక దేశీయ సంస్థానములన్నిటిలో పెద్దదగు మన రాష్ట్రములో 'రాజ్యాంగ సంస్కరణములు అవసరమే

లేదనుట కాని, రాష్ట్రీయ ప్రజలు అట్టి సంస్కరణములకు యింకను సంసిద్ధులుగా లేరని చెప్పుటకాని, ఏ మాత్రము సయుక్తికముగా నుండజాలదు. బుద్ధివైశద్యము కలవారెవరికిని ఇట్టి అభిప్రాయ ముండజాలదని మే మెరుగుదుము. ఇట్టి అభిప్రాయము నెవరైన, ఎట్టి శబ్దములలోనైనను సరే, ప్రకటించిన పక్షమున అది నిజమైన ప్రజా భిప్రాయము కాదని మేము చెప్ప సాహసింతుము. ఫెడరేషను విషయమున ఎవ రెట్టి యభిప్రాయము కలిగి యుండినను ఉండవచ్చును కాని రాష్ట్రములో రాజ్యాంగ సంస్కరణములు జరుగవలయునను విషయమున మాత్రము రెండభిప్రాయములుండ జాలవు. సంస్కరణములు ఈ కాలమునకు తప్పని అవసరములైయున్నవి. ఇప్పటి స్థితిలో ఫెడరేషనునకు రాజ్యాంగ సంస్కరణములకు పరస్పర సంబంధమున్నదా లేదాయను విషయములో అభిప్రాయ భేదములుండవచ్చును కాని 'రాజ్యాంగ సంస్కరణముల అవసరము లేదనువారు మాత్రము ఉండజాలరు. మన రాష్ట్రమున రాజ్యాంగ సంస్కరణముల స్వరూప మెట్టిదిగా నుండవలయునను విషయమున భిన్నాభిప్రాయములుండ గలవేమో, కాని చుట్టు పట్టుల తీవ్రమైన మార్పులగాడ్పులు చెలరేగుచుండ మనము మాత్రము కదలక మెదలక ఉన్న స్థితిలోనుండ వలయునను వృద్ధి మార్గ విముఖుడు ఎవ్వడును ఉండడు. ఇందునకు విరుద్ధముగా బుద్ధిమంతులలో అత్యధిక సంఖ్యాకులు రాజ్యాంగమున మార్పులుచేయక తప్పదనియు, సంస్కరణములు అయిష్టముగా విధిలేక యియ్యవలసివచ్చెనను భావముతో నియ్యగూడదనియు తలచుచున్నారు. కనుక మనకు ప్రసాదింపబడనున్న సంస్కరణములు ఉదారములుగాను కాలము యొక్క అవసరములకును రాష్ట్ర ప్రజల 'వైజ్ఞానిక నైతికాభివృద్ధి' కిని స్వపరిపాలనమునకు అనుగుణ్యమైనవిగను ఉండవలయును.

## మత తత్త్వ దృక్పథము

హిందూ దేశములో మనకు కలిగిన గొప్ప దురదృష్టమేమనగా, దేశీయులలోని వేర్వేరు మత విశ్వాసములు కలవారు తమ తమ మతకారణముల వలన ద్వేషభావములకు లోనైయున్నారు. విషయమును పరిశీలించి చూచినచో, వీరి పోరాటము అధికారముకొరకు ఏర్పడినది; ప్రజల ఆర్థిక రాజకీయ కాంక్షలపైన నాధారపడియున్నది కాని మత సంబంధమగు వైషమ్యము వలనగాదు. హిందూ దేశీయులలో మత విషయముననను విజ్ఞాన విషయముననను కలిగియున్న భిన్నత్వమును ఇట్టి పోరాటము కొరకు దురుపయోగ పరచుకొని ఆయామతములవారు కయ్యమునకు

సిద్ధపరుప బడుచున్నారు. కాని నిజము విచారించినచో ఈ ప్రచారము అర్థరహితము, రాజకీయ విషయికమైనదే కాని మత విషయమైనది ఏ మాత్రమును కాదు. అదృష్టవశమున ఆసిఫ్‌జాహీ వంశీయులచే మత సహనముతోను, ఉదార బుద్ధితోను మన దేశము చాలకాలమునుండి పాలింపబడుచున్నది; ఈ సంగతిని మత ద్వేష సంబంధముగు కళంకము కలదికాదు. ఇప్పటికిని హిందూ దేశములోని యితర ప్రాంతములలో ప్రాప్తించుచున్న పక్షమున, వివిధమతములవారి సామరస్యమున మన రాజ్యము ఎంతో మేలైనదని చెప్పవలెను. ఈ విషయమున, మన రాష్ట్రము చుట్టుపట్లనున్న బ్రిటిషు ప్రాంతములకు గుణపాఠము నేర్పదగినట్లు యున్నదనియును ప్రభుత్వమువారు ఇప్పటికిని గర్వముతో చెప్పుకొనుచున్నారు. అది క్రమమే అయినను బ్రిటిషిండియాలోని వాతావరణము [illegible] ప్రవేశించు లేదని చెప్పజాలము. ప్రభుత్వము వారికిని ఈ సంగతి తెలిసియేయున్నది. వారు ఇట్టి పరిస్థితులను ఎదుర్కొనుటకు తగిన పద్ధతులను అవలంబించగలరు. ప్రభుత్వము వారు ప్రవేశపెట్ట తలచిన సంస్కరణములు బాగుగా సాగింపబడినచో, కొందరు భయపడు చున్నట్లు, మత ద్వేషభావములు ఇచ్చట పెరుగుటకు మారుగా, చాలవరకు తగ్గి పోగలవని మావిశ్వాసము. మత విద్వేషము పెరుగుటకు బ్రిటిషిండియాలో అనేక కారణములుండినవి. అట్టివి మన రాష్ట్రములో లేవు. ఈ రాష్ట్రములో మహామ్మదీయుల సాంఘిక ఆర్థిక స్థితిగతులు, బ్రిటిషిండియాలోని మహమ్మదీయ సోదరుల స్థితులకంటె భిన్నముగా నున్నవి; కనుక వారికిచ్చటగల సమస్యలు బ్రిటిషిండియాలోని వారికున్నటువంటి సమస్యలకంటె భిన్నములైయున్నవి.

హిందూసంఘములోని వారగు ఆదిహిందువులు లేక హరిజనులును, ఇతర నిమ్నజాతులవారును, అన్ని మతములవారి సానుభూతికిని పాత్రులై యున్నారు. హిందువులలోని పూర్వాచార పరాయణులలో సహితము తమ నిమ్నజాతి సోదరులకు సహాయము చేయవలయునను భావము వృద్ధిచెందుచున్నది. మావద్దకు వచ్చిన ప్రశ్నావళి ప్రత్యుత్తరములలో ఒక్కదానియందైనను మత నియోజకవర్గ పద్ధతి (Communal electorate) కోరబడియుండక పోవుటయును, కమిటీలోని ఒక సభ్యుడైనను ఈ పద్ధతి కావలయునని వాదించక పోవుటవలనను, మన రాష్ట్రపు పౌరస్వత్వ, రాజకీయ జీవనమున, ఇతర రాజ్యములలోనున్నట్లు, మత తత్వదృక్పథము లేదని సంపూర్ణముగా రుజువగుచున్నది.

## వివిధసూచనలు; సిఫారసులు.

రాజ్యాంగ సంస్కరణల స్వరూపమెట్లుండ వలయునను విషయమున మన రాష్ట్రవాసుల అభిప్రాయములలో భేదముండవచ్చునని మేము వెనుక చెప్పియున్నాము. సంస్కరణల అవసరము కలదని ఒప్పుకొనువారిలో కొందరు ప్రజా ప్రభుత్వ సంస్థలు (Parliamentary institutions) ప్రవేశ పెట్టనలదని ఆక్షేపించుచున్నారు. ప్రజా ప్రభుత్వ సంస్థలు ఇతర దేశములలో పడిపోయినవనియు, అట్టివి మన రాష్ట్రవాసుల స్వభావమునకు ఏ విధముగాను తగియుండవనియు వారివాదము. ఎవరు కోరినను సత్పరిపాలనమే కోరుచున్నారు కనుక ప్రభుత్వ స్వరూపమునకు ప్రాముఖ్యమియ్య వలదనియు వారు వాదించెదరు. మేము ప్రజాప్రభుత్వ సంస్థల పక్షమున ప్రతివాదము చేయదలచుకొనలేదు. కాని, ఈ యాక్షేపణ చేయువారు ఒక మూల సిద్ధాంతమును మరచుచున్నారని సూచించెదము. అదేదన, ఎవరెట్లు వాదించినను ప్రజాప్రభుత్వ సంస్థలే తుదకు నిలకడ గలవియు ప్రజల యాదరము పొందునవియు నగు రాజ్యాంగ పద్ధతులగుచున్నవి. ఎన్నికల పద్ధతివలన సాధారణముగా కలుగు యిబ్బందులను, ముఖ్యముగ మన దేశముననున్న ప్రత్యేక విభేదకారణముల వలన కలుగు చిక్కులను, తప్పించుకొనుటకై ప్రయత్నముచేయుచో, పైన నుల్లేఖింపబడిన యాక్షేపకులు అత్యుత్తమమగు నొక క్రొత్త విధానమును సృష్టింపవలయునని కోరుచున్నారు. కాని స్పష్టమగు విధానమును దేనిని సూచింప జాలకున్నారు. వివిధములగు హక్కులు కలవారి ప్రతినిధులు ఎట్లో కూడవలయుననియు వారు శాసనసభలో సాహచర్యము (Association) పొందవలయునని, కొన్ని వేళల సూచింపబడినది. కాని వివిధ హక్కులవారి వర్గముల నిర్మాణము మన రాష్ట్రముయొక్క ప్రస్తుత పరిస్థితులలో జాగ్రతగా జరుగుట సాధ్యముకాదని మేము తలచుచున్నాము. మన రాష్ట్రములో విద్యచాల లోపించియున్నది. సాంఘిక వ్యవస్థలు మనశ్శక్తిమానము ననుసరించినవి పూర్తిగాలేవు. పూర్వకాలమునుండి వచ్చుచున్నవియును క్రమముగా నీకాలమున చెదరిపోవుచున్నవియునగు కుల వర్గములతోపాటు మరికొన్ని క్రొత్త వర్గముల ఏర్పరచుట బాగుగానుండదు. కనుక వివిధ హక్కుల వర్గముల పద్ధతి మన రాజ్యాంగముకొరకు సాధ్యముకాజాలదు. ఎన్నికలకొరకై కృత్రిమ వర్గముల నేర్పరచు పద్ధతి సంఘమునందు

అనవసరములగు చిక్కుల కల్పించగలదు. ఇట్టి వర్గముల ప్రతినిధులతో గూడిన శాసన సభ ప్రజామోదమును బడియునది కాజాలదు; నిజమగు ప్రజా ప్రాతినిధ్యముగల సంస్థయుకాజాలదు. ఏలోపములున్నను ప్రజాప్రభుత్వ సంస్థలు భవిష్యత్తున హిందూ దేశములో కొంతకాలమైనను నిలిచియుండుననుట నిస్సంశయము. ప్రజలకు వాని యందు ఏర్పడియున్న అభిమానమును పెరికివేయుట సాధ్యముకాదు. దేశీయ సంస్థానములలోని ప్రజలు తమ చుట్టుపట్టులనున్న బ్రిటిషిండియా ప్రాంతములలోని పరిపాలనా పద్ధతి తమకును ఉండవలయునని కోరుచున్నారు. దేశీయ సంస్థానముల ప్రభుత్వమువారే తమ పరిపాలనా పద్ధతియందు బ్రిటిషిండియా ప్రాంతముల పాలనా విధానమును అంగీకరించుచున్నారు. రాజ్యాంగ విధాన విషయమున క్రొత్తగా కన్ను తెరచినవారము కనుక మనము మన పొరుగువారికి కల అనుభవమువలన లాభము పొందగలమనియు, వారికి కలిగిన పొరపాటునుండి మనము తప్పించుకొనవలయునని యు కమిటీవారికి నిస్సంశయముగా స్ఫురించుచున్నది. మనము బ్రిటిషిండియాతోను హైందవ ఇండియా (Indian India) తోను సమానదశకు రాకతప్పదు. అయినను సాధ్యమైనంతవరకు, మన రాష్ట్రముయొక్క ప్రత్యేక లక్షణములను సంప్రదాయములను నిలుపుకొనవలయును. ఏల యనగా, మనము విశాలతరమగు హైదరాబాదు రాష్ట్రమును నిర్మించవలయును! అట్టి రాష్ట్రము విశాలతరమగు భవిష్యత్ భారత వర్షమును నిర్మించుటకు తగిన విధమున తోడ్పడవలయును!!.

మరికొన్ని ఇతర సూచనలుకూడ కలవు. మన రాష్ట్రమును, తెలంగానా, మహారాట్వాడి, కర్ణాటకము అను మూడు భాషానియుక్త ప్రాంతముల సమాఖ్య (Confederacy) గా చేయవలయుననియు, వీనిలో నొక్కొకదాని కొక ప్రాంతీయ శాసనసభయు, మొత్తము రాష్ట్రమునకొక కేంద్ర శాసనసభయు ఉండవలయుననియు కొందరు మా ప్రశ్నావళికి ప్రత్యుత్తరములలో సూచించినారు. ఈ యభిప్రాయమునకు కారణ సహితమగు ఆధారము ఉండవచ్చును కాని అది యిప్పుడాచరణ సాధ్యముకాదని కమిటీవారి యభిప్రాయము.

డాక్టరు జయసూర్యగారు, మన రాష్ట్రమున ప్రతి గ్రామపక్షమున ప్రతినిధుల నెన్నుకొను ఉద్ధతిని ప్రవేశ పెట్టవలయునని సూచించిరి. నూరు గ్రామముల నొక్కొక్క వర్గముగాజేసి ఇట్టి ప్రతి వర్గమునుండి ఒక్కొక్క ప్రతినిధిని కేంద్ర

శాసనసభకు పంపవలయునని వారి సూచన. ఇట్టి స్కీము వచ్చుటకు పూర్వము స్థానిక పరిపాలనమును జాగరూకతతో నిర్వహించుచున్నట్టి గ్రామసంఘములు ఉండి యుండవలెను. గ్రామ ప్రతినిధులు జిల్లా సంఘములకు పంపబడవలయుననియు జిల్లా సంఘముల పక్షమున ప్రతినిధులు శాసనసభకు వెళ్ళవలయుననియు, పరోక్ష ప్రాతినిధ్య పద్ధతి (indirect method of representation) ని వారు ప్రతిపాదించు చున్నారు. ఈ పద్ధతి భిన్న పరిస్థితులలో, మనదానికంటె భిన్నమగు సాంఘిక వ్యవస్థగలచోట చాల లాభదాయకముగా నుండవచ్చును. ఇట్టి రాజ్యాంగ పద్ధతిని జయప్రదముగా జేయుటకు వలయునట్టి బుద్ధివైశద్యము, సమర్థత ఇంకనులేని మన రాష్ట్రములో ప్రస్తుతమీపద్ధతి అచరణ యోగ్యముకాదని మేము తలచుచున్నాము.



# రెండవ భాగము.

## (అ) రాజ్యాంగ సంస్కరణములు:

### సంస్కరణములు; వాని యావరణము.

ప్రభుత్వమువారు ఏర్పరచిన ప్రత్యేక సంఘమునకు అప్పగింపబడిన విషయముల వివరణము ఈ క్రింది విధముగనున్నది.

> "రాష్ట్రముయొక్క సందర్భములను, దాని యవసరములను దృష్టి యందుంచుకొని, ప్రభుత్వమువారు ప్రజల యావశ్యకములను కోరికలను సదా తెలిసికొను చుండుటకు వీలుండు విధమున, రాష్ట్రమున వివిధ హక్కువారితోడి సాహచర్యము అధిక ఫలదాయకముగా ప్రభుత్వమునకు లభించుటకు, వేర్వేరు పక్షాంతరములను అన్నిటిని విచారణ చేసి నివేదించుట."

ఈ సంఘమును ఏర్పరుపగానే రాజ్యములోని ప్రజలందు చాల ఉత్సాహము ఉద్భవించినది. కాని ప్రభుత్వమువారి ప్రకటనములో స్పష్టముగా పాలిసీ ఏదియు వివరింపబడుటగాని, ఏవిధమైన వాగ్దానమును చేయుటగాని జరుగనందున ఉదారమగు పాలసీయొక్క సంగ్రహవర్ణనమో, అట్టి పాలిసీని సాధించుటకు వలయు స్కీము లేక పద్ధతియో ప్రకటింపబడునని ఆశపెట్టుకొనియున్న ప్రజలకు ఎంతో నిరాశ కలిగినది. ఈ కారణమున ప్రభుత్వమువారు కమిటీకప్పగించిన విషయవివరణము 'మనోహరముగ నస్పష్ట మైయున్నదని విమర్శన వెడలెను. ప్రభుత్వమువారికిని ప్రజలకును ఎక్కువ సమాన సంబంధము కలిగించుటకు ఏయే పద్ధతులు సాధ్యములో అట్టి పద్ధతులనన్నిటిని విశాలముగా ఆలోచించవలయునను ఉద్దేశముతోనే బుద్ధిపూర్వకముగా అట్టి వివరణము కల్పింపబడినదని ప్రభుత్వమువారు స్పష్టపరచిరి. ఇటీవల జరిగిన యీ ప్రకటనము ౧౩౩౭ హిజ్రీలో వెలుబడిన ఫర్మాను ముబారకుయొక్క యనుబంధమే కనుక, రాజ్యాంగ సంస్కరణములను గురించిన విచారణయొక్క అవరణము ఇప్పటికాలపు స్థితిగతులకును అవసరములకును అనుగుణ్యముగా నుండునట్లు విశాలపరుపబడినది.

ఈ సంగతులన్నిటిని గమనించి, మేము మా విచారణములో, స్థానిక స్వపరిపాలనమును, ఇతర సంస్థల స్థాపనమును చేర్చుకొనవలసినవారమైతిమి. దీని వలన ప్రభుత్వమునకును ప్రజలకును మధ్యసహకారము ఎక్కువ సమీపముకలదై, పరిపాలనమునందు ఉభయులకు అధిక ఫలదాయకమగు సాహచర్యము లభింపగలదు.

## శాసనసభల పునర్నిర్మాణము.

౧౩౩౮ హిజ్రీ ఫర్మానులో, ఇప్పుడున్న శాసనసభను విశాలపరచి దానిలో ఎన్నుకొనబడిన సభ్యులధిక సంఖ్యాకులుగా నుండునట్లును, అది 'పరిపాలనాయంత్రములో నొక ముఖ్యభాగము'గా నుండునట్లును చేయబడవలయునని ఉద్దేశింపబడియుండెను. మేము పైనచూపిన ప్రకారము, రాజ్యాంగ సంస్కరణములనుగురించి మ. ఘ. వ ప్రభువుగారిటీవల అనుగ్రహించిన సందేశమువలన, మొదట సంకల్పింపబడిన మార్పులు మరింత ఉదారములైనవి. ఇప్పటికాలపు కోరికలను, జనులలో ఆశ్చర్యకరముగా కలిగిన సాంఘికాభివృద్ధులను దృష్టియందుంచుకొని ఆలోచింపగా కేవలము శాసనసభను విశాలపరచుటవలన అవసరములు పూర్తికాజాలవనియు రాజ్యాంగ విధానమును పూర్తిగా పునర్నిర్మించిననేకాని వీలులేదనియు మాకు తోచినది. ఇప్పటి శాసనసభను మార్చి నూతన పద్ధతిపైన పూర్తిగా పునర్నిర్మాణము చేయుట ఈ కాలమునకు అనివార్యము కనుకనే మేము, ద్విభాగీయ (Bicameral) పద్ధతిపైన శాసనసభను మరల నిర్మించవలయునని సూచించినాము.

## ఏక భాగీయమా ? ద్విభాగీయమా ?

మేము జారీచేసియుండిన ప్రశ్నావళికి వచ్చిన ప్రత్యుత్తరములలో ఎక్కువ సంఖ్యగలవి ఏకభాగీయ (Unicmeral) శాసనసభ కనుకూలముగా నున్నవి. ఇట్టి సూచనకు చూపబడిన కారణముల సారాంశము ఈ క్రింద నియ్యబడినది.

ద్విభాగీయ శాసనసభ, ముందొక గుఱ్ఱము వెనుక నొక గుఱ్ఱము ఈ విధముగా రెండు ముఖముల రెండు గుఱ్ఱములు కట్టబడిన బండివంటిది. ఒకటి ముందుకులాగును; రెండవది వెనుకకు ఈడ్చును. శాసనము అనునది ప్రజాభీష్టము వలన ఏర్పడునది, కనుక ప్రజాభీష్టములు రెండు ఉండజాలవు. రెండవ (భాగపు) శాసన సభకొరకు ప్రత్యేకమగు ఎన్నికల పద్ధతి ఏర్పరుప వలసియుండును. దానివలన

అనవసర వ్యయము సంభవించును. రెండు శాసనసభల వలన పరస్పర భేదభావము, ప్రతిష్టంభనము తప్పక కలుగును. రెండవ శాసన సభలో శిష్టాచారులు సభ్యులుగా నుందురు కనుక ప్రజా ప్రతినిధులుగల సభకది యొక గుదియగును. అట్టిది కాకుండ జాగ్రత్తతో ఉపాయము పన్నగలమనుకొనినచో, అది మొదటి సభవంటిదే యగును రెండు శాసనసభలు నిర్మించుటకు తగిన సాధన సామగ్రిలేదు. హక్కులుకలవారి స్వార్థపరత్వములో శాసనసభవారు జోక్యము పుచ్చుకొనకుండ, ఈ రెండవ సభ అక్రమమగు రక్షణము నిచ్చుచుండును. ఈ కారణమువలన, రెండవ శాసనసభ నిర్మించుట యుక్తముకాదని ఈ పక్షమువారి వాదము.

ద్విభాగీయ శాసనసభ కనుకూల పక్షమున వచ్చిన జవాబుల నీ క్రింది వాక్యములలో సంగ్రహ పరచవచ్చును.

రెండవ శాసనసభవలన శాసన నిర్మాణమున తొందరపాటు జరుగకుండ ఆగును. హక్కులుకలవారికిని, అల్ప సంఖ్యాకులకును ప్రాతినిధ్యము లభించును. ఎంత జనామోదము పొందినవారైనను సరే, బహుళ సంఖ్యాకులగువారి యౌద్ధత్యము రెండవ శాసన సభవలన తొలగగలదు. సామాన్య గ్రామజనులకు తగినంత ప్రాతినిధ్యము ద్విభాగీయ శాసన సభవలననే సాధ్యమగును. మన గ్రామీణ నాయకులను సిద్ధపరచుటకు తగిన క్షేత్రము మొదటి శాసనసభ. వీరే ఎక్కువ సంఖ్యలో తుదకు కౌన్సిలుకు పంపవగిన వారు. మనము మన రైతులను శాసన సభారంగములలో ప్రవేశపెట్టనిచో సంస్కరణములన్నియు నిరుపయోగములేయగును. ఇంతేకాక, శాసన నిర్మాణమును గురించిన ఆలోచనలు ఒక సభవారే చేయుటచాలదు. మొదటి సభవారి ఆలోచనల పునర్విచారించుటకు రెండవ శాసనసభ చాల ఉపయోగకరమగు సాధనమగును. రెండవ సభవారు పునర్విచారించ వలయునను భావమును మనము ఒప్పుకొనక పోయినను, ప్రారంభపు ఆలోచనల జేయుట మొదటి శాసనసభయొక్క పనిగా నిర్ణయించుటలో చాల లాభముకలదు. మన కనేక సమస్యలు ఉన్నవి. మన రాజకీయ జీవితము చాల కొద్దిది. మన హక్కులు అనేకములును భిన్నభిన్నములుగాను గలవు. కనుక ప్రారంభ సభయొకటి పరిపాలనయొక్క పాలిసీని విచారించుటకు గాను నిజమైన వాదవివాదము చర్చలు జరుపుటకై యుండుట ప్రభుత్వమునకు మంచి బలమును కూర్చగలదు. అట్టి సభ వివాదాంశములను స్పష్టీకరించి శాసనసభా కార్యములకు మార్గదర్శకము కాగలదు. రాజ నీతిజ్ఞులను, నిజమైన జాతీయ సేవకులను సిద్ధపరచుటకు అది మంచి ఆశ్రమ స్థానముకాగలదు.

మన రాజ్యముయొక్క స్థితి గతులనుబట్టి ప్రత్యేక శ్రద్ధతో ఈ విషయమును బాగుగా పరిశీలించిన మీదట, ప్రస్తుతము మేము ఏక భాగీయ శాసన సభకు విరుద్ధముగా తీర్మానించితిమి. ప్రపంచములోని శాసనసభల రాజ్యాంగ దశలను పరిశీలించినచో, వివిధములగు పరీక్షలు జరుగుటయు, వివిధములగు ఫలితములు తేలుటయు, కానవచ్చును. రెండు విధములగు పద్ధతులలోను ప్రతి దానికిని పక్షమును వహించి సమర్థించువారు కలరు. "ఏక భాగీయ పద్ధతి చెడ్డదియని రాజకీయానుభవము సిద్ధాంతీకరించుచున్నది" అని ఒక పక్షమువారనుచున్నారు. "ద్విభాగీయ పద్ధతి ప్రజా ప్రభుత్వ విధానము కానేకాద"ని మరియొక పక్షమువారు వాదించుచున్నారు. బ్రిటిషిండియాలో కలిగిన రాజ్యాంగ సంస్కరణల వికాస చరిత్రమునందు ఈ భిన్నాభిప్రాయములు స్పష్టముగా గానవచ్చుచున్నవి. మాంటేగు చెమ్స్ఫోర్డు సంస్కరణములు ఏక భాగీయ పద్ధతిని సూచించెను. ఇండియను స్టాచూటరీ కమీషను (సైమను కమీషను) దానికి విరుద్ధముగా సిఫారసు చేసెను. ఇప్పటి శాసనము (1935) ప్రకారము కొన్ని ప్రాంతములలో ఏక భాగీయ పద్ధతిని కొన్నిటిలో ద్విభాగీయ పద్ధతిని అనుసరించి శాసనసభలు నెలకొల్పబడినవి. ప్రపంచములోని కొన్ని జాతులవారు, ముఖ్యముగా యూరోపు యుద్ధానంతరము నిర్మింపబడిన జాతులవారు ఏక భాగీయ శాసనసభలయెడ అనుకూల భావము చూపుచున్న మాట నిజమైయైనను, ప్రపంచములో అట్టి శాసనసభల యుదాహరణములు చాల అరుదుగా కానవచ్చుచున్నవి. కాని, ఫ్యాసిస్టు పద్ధతి నవలంబించిన కొన్ని దేశములలో రెండు శాసనసభల స్థాపించుట తప్పునిపని యైనట్లు మనకు కనబడుచున్నది.

మన రాజ్యమువంటి ఏకైక రాజ్యాంగ పద్ధతిగల దేశముకొరకు ద్విభాగీయ శాసనసభా విధానము తగియుండుననియు, ఇట్టి విధానమే ఎక్కువ సులభముగాను ఎక్కువ స్థిరమైనదిగాను ఉండుననియు మాతలంపు. ఈ సమస్యను మేము కేవలము తాత్త్వికదృష్టితో పరిశీలించుటలేదు. ద్విభాగీయ పద్ధతి వలదనియు, ఏక భాగీయ పద్ధతియే మంచిదనియు వాదించువారి ముఖ్యాక్షేపణ ఏమనగా, మొదటి పద్ధతి ప్రవేశ పెట్టబడినచో, రెండవ శాసనసభ మొదటి శాసనసభకు ఒక గుదిబెగా నుండుననునదే. అనగా, వారి ఆక్షేపణ శాసనసభలో నుండవలసిన సభ్యులను గురించినదే. హైదరాబాదు రాజ్యపు పుంజీదారులు (capitalists) ఇతర దేశములలోవలె గొప్ప పరిశ్రమల యజమానులుకారు; వారు రైతులతోనే విశేషముగా

సంబంధము కలవారు. మన రాజ్యములోని ఫుంజీదారుల నైఖరి మన రాజ్యము యొక్క అభివృద్ధినిగురించిన సమస్యలలో ఏవిధముగానున్నదో తెలిసికొనుటకు మన అనుభవము తోడ్పడుటలేదు. రెండవ శాసనసభలో అనగా కౌన్సిలులో ఉండు సభ్యులలో **నూటికి ౨౫ మంది** అసెంబ్లీలోనికి ఎన్నికలవలన వచ్చిన వారిలోనుండియే ఉండవలయునని మేము సూచించి యున్నాము. ఈ యుపాయమువలన, శాసన సభలలో శిష్ట పక్షము (Conservative) వారి పోకడలకుగాని, ప్రతిష్టంభనలకు గాని అవకాశములు తగ్గింపబడినవి. ఈ విషయమున తుది నిశ్చయము చేయుటలో మేము మన రాష్ట్రములోనున్న సంప్రదాయములను సంఘనిర్మాణమును జ్ఞప్తియం దుంచుకొంటిమి. దానితోపాటు వోటు హక్కుయొక్క షరతులు తగినంత తేలికగా నేర్పపరచితిమి. ఏది ఎట్లయినను, మొత్తముమీద, ఈ పద్ధతిని ప్రవేశపెట్టి పరి క్షించి చూడవచ్చును. సంస్కరణములు ప్రవేశపెట్టిన తరువాత అనుభవము హెచ్చగలదు. మేము ఇకముందు సూచించిన ప్రకారము, నియమితకాలముగడచిన మీదట ఏర్పరుపబడు కమిషనువారు ఈ ప్రశ్ననుగురించి బాగుగా విచారించుటకు వీలుకలుగగలదు.

## సభ్యుల సంఖ్య (Strength); సభల రచన (Composition)

శాసన సభలలో సభ్యుల సంఖ్య ఎంత యుండవలయునను విషయము కమిటీలో ఎక్కువగా చర్చించబడినది. ప్రశ్నావళికి వచ్చిన జవాబులలో నెట్లో అట్లే, కమిటీసభ్యులు సూచించిన సంఖ్యలుకూడ వేర్వేరుగా నుండెను. జవాబులలో కౌన్సిలులోను, అసెంబ్లీలోను ఉండవలసిన సంఖ్య, క్రమముగా, తక్కువకు తక్కువ ౨౭ ను, ౧౦౦ ను, ఎక్కువకు ఎక్కువ ౧౪౪ ను ౩౦౦ ను అయి యుండెను. మా యభిప్రాయమున, శాసన సభలలోనుండవలసిన సభ్యులసంఖ్యను నిర్ణయించునట్టిది ఒక ఖేయగు సిద్ధాంతమేదియును లేదు. ఈ విషయమున సంఖ్యానిర్ణయము చేయుటలో ఎన్నియో సంగతులు జ్ఞప్తియందుంచు కొనవలయును. శాసనసభలు అతి బాహుళ్య ములుగా నుండగూడదు. కాని తగినంత ప్రాతినిధ్యము లేకుండు విధమున, సంఖ్య అతి విస్తారముగా తగ్గియుండను కూడదు. మన శాసనసభల యొక్క వైశాల్యము, దేశీయ సంస్థానములన్నిటిలోను, విస్తీర్ణమునుబట్టియు జనసంఖ్యనుబట్టియు, వివిధము లగు హక్కులుగల విభాగములను, తెగలనుబట్టియు, పెద్దదగు మన రాజ్యముయొక్క ప్రాధాన్యతకు తగినట్లుండు టేకాక, సందర్భములనుబట్టి ఎంత ఉదారమగు వోటు

హక్కులకు వీలుకలదో అంతటి యుదారతత్త్వముపైన స్థాపింపబడినదిగాను ఉండ వలయును. కనుక మన అసెంబ్లీలో ౨౦౦ మంది సభ్యులును, మన కౌన్సిలులో ౬౫ మంది సభ్యులును ఉండవలయునని మేము సూచించినాము.

మా ప్రశ్నావళికి వచ్చిన జవాబులలో అనేకములు మన శాసనసభల రచననుగురించి కూడ సూచనలు చేసియున్నవి. వానిలో చాల సూక్ష్మములగు వివరములుకూడ జాగ్రత్తగా విశదీకరించ బడినవి. వీనివలన కమిటీ యాలోచనల కు ఏంతో సహాయము లభించినది. ద్విభాగీయమగు శాసనసభ కావలయునని సూచించినవారిలో ఎక్కువమంది, అసెంబ్లీలో నియమితులైన (nominated) సభ్యులు ఉండనేకూడదని యభిప్రాయ మొసగినారు. అయినను, ప్రస్తుతము, అసెంబ్లీలోకూడ నియమిత సభ్యులుండవలయునను మా అభిప్రాయమును బలపరచిన కారణములు ముఖ్యమైనవికలవు. మొట్ట మొదటి సంగతి ఏమనగా, మన శాసనసభ ౪౪ సంవత్సరముల తరువాత మొట్టమొదట ప్రజా ప్రాతినిధ్య పద్ధతిపైన నెలకొల్ప బడుచున్నది; కనుక పరిపాలనానుభవముగల కొందరధికారులను శాసనసభలో నుంచు కొనుట ఈ సభయొక్క సక్రమాభివృద్ధికి ఉపయుక్తము కాగలదు. ఎన్నికలైన మీదట ఏదైన తెగకుకాని, ఏవైన హక్కులవారికిగాని, తగినంత ప్రాతినిధ్యము లేకపోవచ్చును; బొత్తిగా ప్రాతినిధ్యము లభించకపోవచ్చును. అట్టి లోపమును నివారించుటకై చేయబడు ఉపాయమే సభ్యులనియమించు (nomination) పద్ధతి శాసనసభలలో ఎన్నికల విధానము ప్రవేశపెట్టిన ప్రారంభస్థితులో, ఈ పద్ధతి ప్రత్యే కముగా అవసరమగుచున్నది. ఈ కారణమును బట్టి, అసెంబ్లీ సభ్యులసంఖ్య మొత్తములో ఆరవ భాగమును, కౌన్సిలు సభ్యులసంఖ్య మొత్తములో నాల్గవ భాగ మును ప్రభుత్వమువారు నియమించ (nominate) వలయునని మేము సూచించి యున్నాము.

## సీట్ల పంపకము (Allocation of Seats)

ఈ విషయము కమిటీవారు చాల తీవ్రముగా నాలోచించ వలసినదైనది. బాగుగా నాలోచించిన మీదట మేము నిర్ణయించిన సీట్ల పంపకము, అన్ని హక్కులవారికి తగిన సర్దుబాటుకలిగించ వలయునను దృష్టితో పరిశీలించిన పక్షమున, చాల తృప్తికరముగానున్నది. అనుబంధము (అ) లో మేము చూపియున్న

వివరములవలన, అధికారులు అధికారేతరులు ఉభయులు కలసి ఏర్పడు నియమిత సభ్యులసంఖ్య అసెంబ్లీలో 33 ను, కౌన్సిలులో ౧౬ను కానవచ్చును. పై సంఖ్యలో అధికారుల సంఖ్యకును అధికారేతరుల సంఖ్యకును మధ్య సంఖ్యానూపాతము (ratio) ఇంత ఉండవలెనని మేము నిర్ధారణచేయలేదు. అయినను ప్రభుత్వమువారు హైదరాబాదు పురపాలక సంఘము (Municipal Corporation) లో అవలంబించిన సంప్రదాయమునే ఇచ్చట కూడ అవలంబించి, సగము అధికారులను సగము అధికారేతరులను నియమింతురని నమ్ముచున్నాము. ప్రాతినిధ్యము ఇప్పించబడిన ప్రత్యేక హక్కులవారీ క్రింద వివరింపబడినారు. (౧) విశ్వవిద్యాల పట్టభద్రులు (University graduates) (౨) వర్తకులు; పారిశ్రామికులు (Commerce and Industries) (3) సాహుకార్లు, బ్యాంకర్లు (౪) జాగీరుదారులు (౫) జమీందారులు; ఇనాందారులు; ఇతర మాషుదారులు (౬) స్త్రీలు (౭) పాటకపు జనులు (Labour) (౮) ఆదిహిందువులు (౯) సిక్కులు (౧౦) క్రైస్తవులు (౧౧) ఆంగ్లో యిండియనులు విశ్వవిద్యాలయ నియోజకవర్గము(University constituency)కొరకు రెండుసీట్లు మేము ప్రత్యేకించియున్నాము. ఈ నియోజకవర్గములో ఉస్మానియా విశ్వవిద్యాలయముయొక్క పరిపాలక వర్గము (Governing Body) అగు సినెటు (Senate) సిండికేటు (Syndicate) సభ్యులును, హైదరాబాదు రాజ్యములో కాపురముగానుండి తమ పేర్లను రిజిష్టరు చేయించుకొనిన పట్టభద్రులు అందరును, వీరు బ్రిటిషు విశ్వవిద్యాలయముల వారైననుసరే, ఇండియా విశ్వవిద్యాలయముల వారైననుసరే, చేరియుందురు. సాహుకారులు బ్యాంకరులు వేరువిధమైన హక్కులుకల వారు కనుక వారికి ప్రత్యేక ప్రాతినిధ్యమియ్యబడినది. జాగీరుదారులు, జమీందారులు, మాషుదారులు అనువారు మనరాజ్యములోని ప్రాముఖ్యముగల తరగతికిచెందినవారై యున్నారు. సాధారణముగా శాసనసభకు సభ్యులు ఈ తరగతినుండియే యెన్నుకొనబడెదరు; అయినను, వీరికి మన రాజ్యమున ప్రత్యేక గౌరవముకలదు కనుక ఈ రెండు తెగల వారికి వరుసగా ౪, ౫ సీట్లు ఉంచబడినవి. వీరు వీరికిగల ప్రత్యేక సంస్థల వలన ఎన్నుకొన బడెదరు. స్త్రీల వోట్లహక్కును గురించి, ఈ నివేదికలో, వేరొక చోట వివరింపబడినది; అయినను, ముందు అధమము కొంతకాలమువరకైనను, సాధారణ నియోజకవర్గము (General electorate) లో పోటీచేసి ఎన్నుకొన బడజాలరు. బహుశః హైదరాబాదు నగరమున నిది జరిగిన జరుగునేమోకాని తక్కినచోట్ల జరుగజాలదు. స్త్రీలలో ప్రస్తుతము తగినంత మందికి వోటు యిచ్చు హక్కు

కల్పించుటకై ప్రత్యేక పద్ధతులను మేము సూచించియున్నాము. అయినప్పటికిని ప్రాతినిధ్యముకొరకు వారు ప్రత్యేక వర్గముగా ఏర్పరుప బడియున్నారు ఇప్పుడు స్త్రీల సంఘములు పని చేయుచున్నవి. వానిలో కొన్ని మంచి అంగనిర్మాణముకలవై తగినంత ప్రాతినిధ్యము కలవిమైయున్నవి. ఈ సంఘములు, స్త్రీలకు ఎన్నికలలో పోటీచేయుటకు స్వాతంత్ర్యమును అవకాశమును ఇచ్చుటయేకాక, తమ పక్షమున, అసెంబ్లికి ౫ గురు ప్రతినిధురాండ్రను పంపుటకు వీలు కలిగించ వచ్చును. ఆది హిందువుల సమస్య కమిటీసభలో కొంత వాదవివాదమునకును, రాయభారములకును కారణమైనది. వారు కమిటీకి పంపియుండిన విజ్ఞప్తిలో, రాష్ట్రమునందు వారి సంఖ్యయొక్క మానము (Proportion) ను బట్టి, సగటు సంఖ్యగల సీట్లు ప్రత్యేకింప బడవలయునని కోరిరి. కాని, ఈ తరగతులవారు చాల వెనుకబడియున్న కారణమును బట్టియు, సీట్లను ప్రత్యేకించు (reservation) పద్ధతి నొప్పుకొనినను, సాధారణ ఎన్నికలలో పోటీ చేసినందున లాభము కలగజాలదని తుదకొప్పుకొనబడినది. కనుక ఈ తెగవారి ప్రాముఖ్యమును, వారికి ప్రత్యేక రక్షణము కలిగించవలసిన అవసరమును ఆలోచించి, వారి అంగీకరింపబడిన (recognized) సంస్థలు, ౧౦ మంది సభ్యులను ఎన్నుకొని అసెంబ్లీకి పంపవచ్చును అని ఏకగ్రీవముగా నిశ్చయించబడినది. క్రైస్తవ సంఘము (Chiristian Association) వారి విజ్ఞప్తిలో తమ మతమువారికి ప్రత్యేక సీట్లు ఉండవలయునని కోరబడలేదు. కాని, అట్లను కొనినచో, సాధారణ ఎన్నికలలో వారు రానే రారేమో అను సందేహముతోచి నందున, క్రైస్తవులు, ఆంగ్లో ఇండియనులు, పారసీలు, సిక్కులు, వీరి ప్రతినిధి సంఘములు ఒక్కొక్కసభ్యుని ఎన్నుకొని పంపునట్లు ఎర్పాటు ఉండవలయునని మేము సూచన చేసియున్నాము.

సాధారణ నియోజక వర్గముకొరకు మేము చేసిన సీట్ల పంపకమును గురించి, శిష్టాచారుల దృష్టితోను, సమూలముగా మార్పులు చేయవలయునను వారి దృష్టితోను, (from the conservative and the radical point of view) అక్షేపణ జరుగవచ్చును. అయినను, మన రాజ్యముయొక్క ప్రత్యేక స్థితులను గురించి, మేము, సీట్ల పంపకములో, హైదరాబాదు నగరమునకును, జిల్లాల ప్రధాన స్థలములకును, ప్రత్యేక ప్రాముఖ్యము నిచ్చినాము. ఈ ప్రదేశములనుండియే విజ్ఞానముగల బుద్ధిశాలులు శాసనసభా సభ్యులుగా నుండుటకై ఎన్నుకొనబడె

దరని మేము ఆశించుచున్నాము. ఈ దృష్టితో మేము చేసిన విభాగమును బట్టి, ముస్లిము తెగవారికి సీట్లు ప్రత్యేకించవలసిన అవసరము లేదని — లేక, తక్కువగా గలదని— స్పష్టపడుచున్నది. ఈ సమస్యనుగురించి మేము ముందు వినగింతుము.

ఇక కౌన్సిలు సంగతి:- దీని కొరకు ౧౬ గురు సభ్యులు అసెంబ్లీలో ఎన్నికలవలన వచ్చిన సభ్యులలోనుండి ఎన్నుకొనబడవలయుననియు, 33 గురు సభ్యులు సాధారణ నియోజక వర్గమువలన — అట్టి నియోజక వర్గములు భూభాగపద్ధతి (territorial) న విడదీయబడినవై — ఎన్నుకొనబడవలయుననియు సూచించినాము. ఎన్నుకొనువారికి మేము విధించిన యోగ్యతలనుబట్టి సూచిన-చో భూసంబంధమైనట్టియు ఇతర విధమైన స్థిరమైనట్టి (vested) యు హక్కులుగలవారందరికి జన సమ్మతమైన విధమున ప్రాతినిధ్యము లభించగలదు. మొత్తముమీద మేము సూచించిన సీట్ల పంపకము మన రాజ్యముయొక్క స్థితులను బట్టి తృప్తికరముగా నుండగలదని మాకు తోచుచున్నది.

## అధికారములు; నిర్బంధములు

శాసనసభను, 'పరిపాలనా చక్రముయొక్క ముఖ్యభాగముగా చేయవలయు'నన్న పక్షమున, శాసన సభద్వారా ప్రజాభిప్రాయమును గట్టిగా ప్రకటించుటకు కావలసిన విధమున శాసనసభయొక్క కర్తవ్యములను నిర్ణయించుట అవసరము. ముఖ్య కర్తవ్యము లీ క్రిందివి:- (౧) శాసన నిర్మాణము (౨) ప్రశ్నోత్తరములు (3) తీర్మానములు (౪) బజెటు (మవాజనా) ను చర్చించుట; అంగీకరించుట; (౫) పన్నులు వేయుట. శాసనసభకు ఈ అధికారములు అన్నియు ఉండవలయును. అది ఈ అధికారములను చలాయించ వలయును. ఇది జరగనిది ఉదారములగు సంస్కారములు చేయుటయను మాట సార్థకముకాదు. ఈ పని జరుగని పక్షమున ప్రభుత్వములో ప్రజలకు క్రియాపూర్వకమగు సాహచర్యము సంపాదించ వలయునను ఉద్దేశము నెరవేరదు.

శాసనసభల కుండవలసిన పై అధికారములనన్నిటిని అమలు పరచుటలో కొన్ని నిర్బంధములు రాజ్యాంగ విధానమున నుండవలయును. ఈ నిర్బంధములు రెండు విధములైనవి. మొదటి విధము: ఈ రాజ్యము ఏకైక రాజ్యాంగ పద్ధతిది.

మన రాజ్యమున కలుగవలసిన రాజకీయాభివృద్ధికి అదియే మూలతత్వము; కనుక అట్టి రాజ్యాంగ పద్ధతిని బట్టి ఏర్పడు నిర్బంధములు. రెండవ విధము: శాసన సభల కియ్యబడిన అధికారములను ప్రజా ప్రతినిధులగువారు ముందెప్పుడైన దురుపయోగపరచు పక్షమున ఉండవలసిన రక్షణలు. కనుక, శాసనసభయొక్క అధికార అవరణమునుండి పూర్తిగా తొలగించదగిన విషయములు కొన్నియుండును; మరికొన్ని విషయములు, కొన్ని షరతులు పూర్తియైన మీదట శాసనసభయొక్క అధికారావరణములోనికి రాదగినవైయుండును. మొదటి విధపు నిర్బంధములలో, అంగీకారమిచ్చుహక్కు, నిరాకరించుహక్కు, ఇతర అధికారములు చేరియున్నవి. రాజు ప్రభుత్వమునకు అధ్యక్షుడు అగుటయే కాక, శాసనములకును మూలకారణుడును వానిని అంగీకరించు వాడును అయి యున్నాడు. ఇక రెండవవిధమైన నిర్బంధములు కేవలము రాజ్యాంగ సంబంధమైన చర్యల విధానమునకును, వివరములకును సంబంధించినవైయున్నవి. వీనిని గురించి కమిటీవారి సిఫారసులో వివరింపబడియున్నది. ఇట్టి నిర్బంధములుండుటవలన, శాసనసభలు, తీవ్రపరిస్థితులను, ప్రతిష్టంభనములను కలిగించకుండ యదార్థముగా ఫలదాయకములు కాగలవు.

## రాజాధికారములు:

రాజునకుగల అధికారములు రెండు విధములైనవి (౧) శాసన నిర్మాణము (౨) కార్య నిర్వహణము. అన్ని విధములైన శాసనములను నిర్మించు కేంద్ర శక్తి రాజుది కనుక ప్రతిశాసనము, అమలులోనికి వచ్చుటకు ముందు శ్రీవారి అంగీకారమును పొందవలసియుండును. అయినను, రాజ్యాంగవిధానము ప్రకారము శాసన నిర్మాణకార్యములు శాసనసభల కప్పగించబడియున్నవి. కనుక అంగీకారమును నిరాకరించు విషయమున రాజుగారికిగల అధికారము ఎప్పుడో అరుదుగా తప్ప, సాధారణముగా ప్రయోగించబడదు. కాని అత్యంతావసరమగు విషమస్థితులలో ప్రజా ప్రతినిధుల సభలకుగల అధికారమును అడ్డగించుటకు ఇది తగిన పద్ధతి అయియుండును.

ఈ నివేదికలో ఇదివరకు ఒకచోట మేము సూచించినట్టుగా, మా సిఫారసులలో సూచించబడిన ప్రత్యేక విధమగు బాధ్యతాయుత ప్రభుత్వమునందు తన యిష్టానుసారము మంత్రులను నియోగించుటకును, తొలగించుటకును రాజునకు గల అధికారమునకు హద్దులులేవు. ఈ నివేదికలో ప్రతిపాదింపబడిన రాజ్యాంగ

విధానము అమలులోనికి వచ్చిన తరువాత గూడ మన రాజుగారికి అనుశ్రుతముగా సంప్రదాయానుసారము వచ్చుచున్న సంపూర్ణ కార్య నిర్వహణాధికారములు అట్లే నిలిచి యుండగలవు. శాసనముల అంగీకారము నిరాకరించుటకును, స్థిరపరచుటకును అవసర సందర్భములలో అసాధారణ శాసనముల అమలులో పెట్టుటకును, కార్యనిర్వాహకుల (మంత్రుల) నియోగించుటకును, తొలగించుటకును, కౌన్సిలును కొంత కాలమువరకు నిలిపియుంచుటకును, శాసనసభల రద్దుచేయుటకును, రాజ్యాంగ విధానమును మార్చుటకును, రాజాధికారమును బట్టి ఇతర అధికారముల చలాయించుటకును ఉండు హక్కులు మా సిఫారసులలో వివరింపబడియున్నవి.

## బాధ్యత యొక్క సర్దుబాటు.

మన రాజ్యాంగము వంటి ప్రత్యేక విధానము గల చోట, బాధ్యతను ఎట్లు సర్దుబాటు చేయవలయునను సమస్య ఎన్నియో చిక్కులతో గూడినదై యున్నది. ద్విభాగీయ మైన శాసనసభయు, రాజువలన నియోగించబడి ప్రధానముగా వారికి జవాబు దారై యుండు కార్యనిర్వాహక వర్గము ఉండుటయు, కొన్ని వేళల పోరాటమునకు కారణము కావచ్చును. కనుక అట్టి పోరాటములకును ప్రతిష్టంభనములకును వీలు లేకుండునట్లు రాజ్యాంగ విధానమునందు సర్దుబాటులు, రక్షణలు ఉండవలయును. కార్యనిర్వాహక (మంత్రి మండల) సభాసదుల మొత్తములో సగముమందిని మ.ఘు.వ. ప్రభువుగారు శాసనసభయందలి ఎన్నుకొనబడిన సభ్యులలోనుండి నియోగించ వలయునని మేము చేసిన సూచనవలన, పరిపాలనమందు బాధ్యతను ఎట్లు ప్రవేశ పెట్టుట మా ఉద్దేశమో రుజువుకాగలదు. ఈ సూచనవలన రాజుగారికి తన మంత్రులను ఏర్పరచుటకుగల అధికారము మార్పుచెందక ఎప్పటియట్లే ఉన్నదని స్పష్టముగా తేలుచున్నది. దానితోపాటు, మంత్రులలో సగముమంది, శాసన సభలోని ఎన్నుకొనబడిన సభాసదుల విశ్వాసమునకు పాత్రులైనవారుగా నుందురని మా సూచన గట్టిపరచుచున్నది. ఇట్టి సూచన మొదట చూచువారికి కొంత విచిత్రముగా గానవచ్చునేమో కాని, మా ఉద్దేశమునకు, ఇటీవల కొచ్చిను మహారాజుగారు అనుగ్రహించిన రాజ శాసనమువలన బలముకలుగుచున్నది. శ్రీకొచ్చిను సంస్థానాధీశుడు, తన శాసనసభలో ఎన్నుకొనబడి వచ్చిన యొక సభ్యునికి కొన్ని శాఖలను (Departments) పరిపాలించు పనిని అప్పగించి, అతనిని మంత్రిగాజేసి దీవానుకు సహాయకుడుగా పని చేయవలయునని ఆజ్ఞాపించుటవలన, ఈ తత్వమును క్రియాపూర్వకముగ అమలు పరచిన వాడయ్యెను. కనుక ఈ పద్ధతి ఆచరణ యోగ్య

ముకాదని చెప్పుటకు వీలులేదు. మేము సూచించిన బాధ్యతా పద్ధతి అసంగత మైనదియు కాదు. ఈ కారణమును దృష్టిలోనుంచియే మేము, కొన్ని జాతీయ నిర్మాణ శాఖలను (Nation Building Departments) అధికారేతరులనుండి తీసికొనబడిన మంత్రుల వశముచేయబడి వారి పాలనలో నుండవలయునని సిఫారసు చేసియున్నాము. *

పై చెప్పినదానిని బట్టి కొంతకాలము క్రింద బ్రిటిషిండియాలో వాడుక యందుండిన ద్వంద్వ ప్రభుత్వ పద్ధతి (System of Diarchy) ని ప్రవేశపెట్టుట మా యభిప్రాయమని తలచగూడదు. ద్వంద్వ ప్రభుత్వ విధానములో సహజముగా చేరియుండు లోపములు మన రాజ్యమున ప్రవేశించ జాలవు. ఉభయ శాసన సభలకు మధ్యనుండ వలసిన రాజ్యాంగ సంబంధమును గురించి తగిన ఏర్పాటులు సూచించబడినవి. అవేమన, శాసనసభల సమిష్టిగా సమావేశపరచుట (Joint Sessions), ప్రభుత్వమువారు ప్రతిపాదనల అంగీకారము నిరాకరించుట, స్థిరపర చుట, తుదకు రాజు స్వయముగా తన రాజాధి కారమును ప్రయోగించుట అనునవి. అంతవరకును పనిలేదు. క్రొత్త రాజ్యాంగము వలన దొరకు అధికారములను శాసనసభలు దురుపయోగ పరచకుండుటకుగాను, మేము శాసనసభల అధికారము లను గురించి సూచించిన నిర్బంధములే తగినంత గట్టి రక్షణలుగా పనిచేయగలవు.

## (అ) వోటిచ్చు హక్కులు

## వయోజనులకు వోటు

ఈ కమిటీవారు వోటిచ్చు హక్కును గురించిన సమస్యలను జాగ్రత్తతో నాలోచించిరి. ఈ విషయములో అంకెల ఆధారముపైన సరియగు నిశ్చయమునకు వచ్చుటకై కావలసిన సామగ్రిని సంపాదించుట కమిటీకి సులభమైన పనిగానుండలేదు. ౧౯౩౧ సం॥ రపు జనపరిగణ రిపోర్టు తప్ప, సప్రమాణములగు రిపోర్టులుగాని అంకెలు

---

* ఈ విషయమున, ఇండియన్ మెడికలు అసోసియేషను, హైదారాబాదు దక్కన్ శాఖ (Indian Medical Association, Hyderabad Deccan Branch) వారు తమ క్రింది తీర్మానమును మాకు పంపినారు:— వైద్య వృత్తియందున్న పురుషులును, స్త్రీలును ఈ రాజ్యపు పౌరులలో ముఖ్యులగు వారనియు, జాతీయ పునర్నిర్మాణమునకు సంబంధించిన ఎట్టి స్కీమునందును కొన్ని విషయములలో వీరి తోడ్పాటు వీడరానిదనియు, వారికిగల ప్రత్యేక

గాని లభించలేదు. ప్రభుత్వమువారికి మాల్గుజారీ పన్నుల చెల్లించుచున్న జనుల సరియైన సంఖ్యకూడ దొరకలేదు. నానావిధములైన విడివిడి సామగ్రిలను ఒక చోటకూర్చుకొని, అందాజా ప్రకారము సరియనుకొనబడు ఫలితములను కమిటీవారు తేల్చుకొనవలసిన వారైరి. ఈ కారణములవలన, నిక్కచ్చిగా సరియైనవని మేము వాదించని మా అంకెలను కఠినముగా పరీక్షించ గూడదు.

మా ప్రశ్నావళికి వచ్చిన కొన్ని జవాబులలో, వయోజనులందరికి వోటిచ్చు హక్కు ఇచ్చుట మంచిదని సూచించబడినది. మాకు లభించి సాధన సామగ్రిని బాగుగా పరిశీలించిన మీదట ప్రస్తుతము ఇది ఆచరణయోగ్యము కాదని తోచినది. లోథియను కమిటీవారి నివేదికలో వోటు హక్కులను గురించి వ్రాయబడిన భావములన్నిటితో మేము పూర్తిగా ఏకీభవించము కాని ఆ నివేదికలో చర్చించబడిన కారణములు చాలవరకు మనకును వర్తించుచున్నవి. ప్రస్తుత పరిస్థితులలో వయోజనులందరికి వోటు ఇచ్చుట అనుష్టాన యోగ్యముకాదను ఫలితాంశమునందు మేమును వారును సమానాభిప్రాయులము. దీనిని అవలంబించక పోవుటలో బ్రిటిషిండియాకు గలదానికంటె మనకెక్కువ కారణమున్నది. అయినను, గ్రామస్థులగు ప్రజలు సామాన్యముగా వెనుకబడియున్నందున వారికి వోటు హక్కు పనికి రాదనునట్టి వాదమునకు అంతగా ప్రాముఖ్యము మేము ఇయ్యవలంపము.

---

విషయజ్ఞానమువలన వారు, ప్రభుత్వమువారి యెదుటను వివిధములగు ప్రతినిధి సంఘముల ఎదుటను దేశీయుల ఎదుటను ప్రజారోగ్యమును గురించి జనులకుగల సాంఘిక, ఆర్థిక అవసరముల విషయములోతమ సూచనలను పెట్టుటకు శక్తులైన్నారనియు తీర్మానించనైనది.

ప్రపంచములోని ఇతర దేశములందు వైద్యులును, వైద్యురాండ్రును ప్రజాహిత జీవనమునందు ముఖ్యముగా పాల్గొనుచున్నట్లు అంగీకరింపబడినను, మ. ఘ. వ. ప్రభువు గారి రాజ్యములో వైద్యవృత్తివారి దృక్పథమునకు తగినప్రాధాన్యత ఇయ్యబడలేదనియు, ప్రజారోగ్య సమస్యలందు వారి సహకారము కోరబడుట గాని ప్రోత్సహించుటగాని లేదనియు రాజ్యములో ప్రజా సమూహముయొక్క ఆరోగ్య సమస్యలు ఇప్పటివరకును పరిపాలకుల చేతిలోనే యున్నవనియు, ఈ పరిపాలకులకు ప్రజలలోని బహుళ సంఖ్యాకులతో సమీప సంబంధము లేదనియు రాష్ట్రములోని వైద్యవృత్తిగల మేము తలంచుచున్నాము.

కనుక మా అసోసియేషను వారి అభిప్రాయ మేమనగా:— బ్రిటిషిండియాలోని కొన్ని వృద్ధి మార్గమందున్న ప్రాంతములలో వలెనే, ప్రస్తుతము అధమ పక్షమున నొక వైద్యశాఖా మంత్రిని ఏర్పరుప వలయును. ఈ మంత్రికి సూచనల చేయుచు తోడ్పడుటకు గాను ఒక ఆరోగ్య ఆలోచన సంఘము (Advisery Board of Health) రాజ్యములో నున్న వైద్యవృత్తి వారి వలన ఎన్నుకొనబడిన అధికారేతరులు కలది, యుండవలయును.

అర్థిక, విద్యామానమునందు మన గ్రామవాసులు తగ్గియున్నప్పటికిని, వారికి మంచి వ్యవహార జ్ఞానము ఉన్నది. వోటు ఇచ్చు విషయమున తగిన వివేచనాశక్తిని ఉపయోగపరచుటకు కావలసినది అదియేకదా. వోటిచ్చువారికి కావలసినది, తనకుగల అక్కరలు ఏవి, వాని తీర్చుటకు ఏమి కావలెను అనుజ్ఞానమే. ఇది యున్నచో, బడిచదువు వచ్చియుండుట గాని ఇతర యోగ్యతలు కాని అంతగా అవసరముండవు. మన గ్రామసోదరులకు తమ వోటును సరిగా వాడుటకు తగిన వ్యవహార జ్ఞానము ఉండనేయున్నది. ప్రారంభదశలో వోటులను అక్రమముగా నుపయోగించుటయు, ఆలోచనయందును క్రియయందును కొంత పొరపాటులలో బడుటయు, జరుగవచ్చును, కాని, స్థిరపడి, సంగతి సందర్భముల గ్రహించి ప్రజాక్షేమకరములగు శాసన నిర్మాణ సభల అవగాహన చేసికొనిన తరువాత, వారు సామాన్యముగా పొరబడజాలరు. కనుక మేము సూచించిన గ్రామ పంచాయతీలకు వయోజనుల కందరికి వోటు హక్కును కోరియున్నాము; కాని, ప్రస్తుతము అచరణ యోగ్యముకాదని భావించి, శాసనసభలకు అట్టి హక్కును కోరలేదు. బాధ్యతాయుత ప్రభుత్వమను దానికి అట్టి హక్కే పరమావధిగా నుండవలయును. ఈ యాదర్శమును దృష్టియందుంచి, జన సంఖ్యలో సాధ్యమైనంత బాహుళ్యముగా జనులకు వోట్ల హక్కు ప్రసాదించి నియోజక వర్గమును విశాలపరచ వలెను.

## వోటరుల సగటు సంఖ్య

మాయెదుటనున్న సాధన సామగ్రిని జాగరూకతతో గమనించి, ఈ సమస్యను అన్ని దృక్పథములతోను పరిశీలన చేసినమీదట, మాకు తోచిన దేమనగా ప్రస్తుత పరిస్థితులలో మొత్తము జన సంఖ్యలో నూటికి పదిమందికి వోటు అధికారము ఇయ్యవచ్చును. మాకు అందిన కొన్ని ప్రత్యుత్తరములలోని వివరములను బట్టి ఈ సంఖ్యను ఇంకను పెంచుట సాధ్యముకాదాయని ఆలోచించితిమి. కాని మన గ్రామస్థులకు ఎన్నికల పద్ధతి నూతనమైన దగుటవలన ఈ విషయమున మేము ఎక్కువ మార్పు కోరవలదని ఎంచితిమి. మేము వోటరుకు నిర్ణయించిన ఆస్తి సంబంధమైనట్టియు ఇతర విధమైనట్టియు యోగ్యతలు, మనకు చుట్టుప్రక్కలనున్న బ్రిటిషిండియాలోను, మైసూరు, తిరువాన్కూరు, సంస్థానములలోను ఉన్నవానికంటె హెచ్చుగాను క్షేమకరముగాను ఉన్నవి. హైదరాబాదునగరము, జిల్లాప్రధాన స్థలములుతప్ప తక్కినయన్ని చోట్లవారికిని చదువు వచ్చియుండుట,అనగా ఏదేనియొక

భాషలో ఉత్తరము వ్రాయుట ఉత్తరము చదువుట, వోటిచ్చుటకు అధిక యోగ్యత యని నిర్ణయించి నప్పటికిని ఈ యోగ్యతనుబట్టి వోటిచ్చు వారి సంఖ్య ౨ లక్షల ౫౦ వేల కంటె మించదని మా అందాజా అయియున్నది. సంవత్సరమునకు, రు. ౧౦ మాల్గుజారీ ఖుష్కి భూములకు గాని రు. ౧౫ ల మాల్గుజారీ తరీ భూములకు గాని చెల్లించునట్టి వారు స్వయముగా పట్టాదారులైనను సరే, ఖజ్బాదారు లైనను సరే, వోటు హక్కు కల్పింపబడి యున్నారు. అట్టి వోటరులు ౮ లక్షలకంటె మించజాలరు. జాగీరుదార్లు, ఇనుముద్దార్లు, మాషుదార్లు ఇతర ఆస్తికలవారు, — మేమెవరెవరికి వోటు ఇవ్వవలయునని సూచించినామో — (వీరిలో ఎక్కువ మంది నగరములోను, జిల్లాల ప్రధాన స్థలములందును వారికి విధింపబడిన యోగ్యతలు కలవారును గూడ చేరియున్నారు) అందరును చేరి ౨ లక్షలు అయితే చాల గొప్ప. దేశములో ఆస్తిగల తెగలవారు ఎన్నికలలో వచ్చుటకుగాను, కౌన్సిలు, లేక పై శాసనసభ యొక్క సభ్యులను ఎన్నుకొను వారికి ఆస్తి సంబంధమైన యోగ్యత తగినంత హెచ్చుగా నేర్పరచి యున్నాము. ఇట్లు చేయుటవలన, స్త్రీలు పురుషులు అందరు కలసి అగు వోటరుల సంఖ్య ౧ లక్ష ౫౦ వేలకు మించకుండ అయినది. స్త్రీలకును ఆదిహిందువులకును కల్పింపబడిన అధిక యోగ్యతవలన దాదాపు ౨ లక్షల వోటర్లు వచ్చెదరు. ఈ విధముగా నేర్పడు వోటర్ల మొత్తము ౧౬ లక్షలగును. దీనిలో ౨ లక్షల వోట్లు, ఒకరొకరికే రెండు విధముల యోగ్యతలు ఉండుటవలన, తగ్గిపో వచ్చును, మిగిలినవి ౧౪ లక్షలు. అనగా రాష్ట్రీయ మొత్తము జన సంఖ్యలో నూటికి ౧ంకి కొంచెము తక్కువగానుండును. ఈ అంకెలు నిక్కచ్చిగా సరికాక పోవచ్చును. అయినను వేర్వేరు పద్ధతులతో లెక్కచేసి గుణించితిమి; కనుక దాదాపుగా సరియైనవే కాగలవు.

మేము నిర్ణయించిన సగటు సంఖ్య చాల హెచ్చైనదని ఎక్కువ మార్పులను గోరని శిష్టాచారులగువారు ఆక్షేపించవచ్చును. వోటు హక్కులు కలవారి సగటు సంఖ్య చాల హెచ్చుగా నుండవలయునని సూచించిన ఉత్సాహవంతులగువారు మా నిర్ణయమువలన నిరుత్సాహ పడవచ్చును. కాని ఇట్టి ముఖ్య విషయములో అతి విశాలముగాక, అతి సంకుచితముగాక మధ్యమార్గమున బోవుటయే సాధారణముగా మంచి పద్ధతియనిపించుకొనును. మా కమిటీ సభ్యులలో కొందరు ఆస్తి సంబంధ మైన యోగ్యత అతి హెచ్చుగా నుండవలయునని వాదించిరి కాని అంకెలను

వివరములను పరీక్షించిన మీదట అట్టివారు తమ అభిప్రాయముల మార్చుకొనిరి. మేము ఇట్టి సగటు సంఖ్యను నిర్ణయించుటలోను, వోటరుల యోగ్యతలను విధించుట లోను, మనకున్న పరిపాలనా యంత్రము, వోటరుల పట్టికలను సిద్ధపరచుటకును, ఎన్నికల ఏర్పాటులు చేయుటకును చాలి యున్నదికదా యని పరిశీలించి తృప్తులమై యున్నాము. ఇంతకంటె సగటు సంఖ్యను హెచ్చించిన పక్షమున ఆచరణలో ఎక్కువ కష్టములు కలుగగలవని మాకు తోచినది.

## జట్టు (Group) పద్ధతి.

వయోజనులకందరికి వోటు హక్కునిచ్చుట ప్రస్తుతము ఆచరణయోగ్యము కాదని పైన చూపి యున్నాము. రాష్ట్రములోని మొత్తము జన సంఖ్యలో ౧౦౦౦కి ౫౦ మంది చదువు వచ్చినవారు: అనగా ఉత్తరము వ్రాయుటకు, ఉత్తరము చదువు టకు శక్తి కలవారు. దీని భావమేమనగా, ౫ ఏండ్లను అంతకు ఎక్కువయును వయ సుగలవారిలో నూటికి ౫ మంది చదువగలవారు. ౧౯-౨౧ సంవత్సరముననున్న వారి కంటె ఇప్పుడు చదువుకొనిన వారి సంఖ్య ౧౦౦౦కి ౧౭ చొప్పున పెరిగిన మాట నిజ మేకాని ఇది తృప్తికరము గాదు. వోటు జాగ్రత్తగా నిచ్చుటకు చదువు వచ్చుట ఒకటియే యోగ్యతయని చెప్ప వీలులేదు; కాని ఎన్నికల యర్థమును తెలిసికొనుటకును వోటుయొక్క విలువను ఉపయోగమును గ్రహించుటకును ఇది మంచి యాయు ధము. కనుకనే మేము నూటికి ౧౦ కంటె ఎక్కువ వోటర్లుండుట ప్రస్తుతము అవసరములేదనియే సూచించవలసిన వారమైతిమి.

ప్రత్యక్షముగా వోట్లిచ్చు హక్కు ఎవరెవరికి కలిగించ జాలమో అట్టి వారినికూడ వోటర్ల ఆవరణములోనికి తీసికొని వచ్చుటకై, వోటు హక్కును విశాల పరచు పరోక్ష పద్ధతి ఒక్కొక సమయమున అవలంబింపబడినది. ఈ పద్ధతికి "జట్టు పద్ధతి" "ముఖి పద్ధతి" యనిపేర్లు. ౧౦ లేక ౨౦ లేక ౨౫ గురి జట్టుతమలో నొకనిని ప్రతినిధిగా నెన్నుకొనును. ఈ ప్రతినిధి ఆ జట్టువారి పక్షమున క్రమమైన ఎన్నికలలో వోటిచ్చును. ఇట్టి జట్టువారు మొదటి వోటరులు (Primary voters) అనియు, వారివలన ఎన్నుకొనబడిన యాతడు రెండవ వోటరు (Secondary voter అనియు వ్యవహరించ బడును. ఈ పద్ధతి పైన వోట్లు జరిగినచో, రాజ్యములోని జన సామాన్యమునకు రాజ్యాంగ వ్యవహారములలో అభిరుచి కలుగగలదు. హెచ్చు తగ్గులు లేకుండ జనులందరు పరోక్ష పద్ధతినే యైనను సరే మొత్తము మీద వోటిచ్చు హక్కుకలవారగుదురు.

అయినను, ఇప్పటి కాలముననున్న జనుల స్థితి గతులను గమనించిచూచిన మీాదట కమిటీవారికి ఈ పద్ధతి చిక్కులతో గూడుకొనినదని తోచియున్నది. మొట్ట మొదటి ఆక్షేపణ ఏమనగా, ఈ పద్ధతి వయోజనుల కందరికి వోటు ఉండవలెనని అంగీకరించబడిన చోట్ల మాత్రమే వర్తించును అచ్చట ఈ పద్ధతివలన వోట్లిచ్చుట సులభమగును. అవసరమైన దానికంటె ఎక్కువ సంఖ్యగలవారికి వోటు హక్కు ఇచ్చుటయు, వారి వోట్లు తీసికొనుటలో ప్రత్యక్ష పద్ధతి కొందరి విషయమునను, పరోక్ష పద్ధతి కొందరి విషయమునను, ఈ విధముగా ద్వంద్వ పద్ధతి నేర్పరుచుటయును సయుక్తికము కాజాలదు. దీనివలన వోటర్లలో అక్రమమగు తారతమ్యములు కల్పించుటయు, పాలనా సంబంధమగు (Administrative) చిక్కులు కలిగించుట యు అగును, ఇంతేకాదు. ఈ పద్ధతి ప్రవేశ పెట్టుటకుముందు, జట్టుల సిద్ధపరచుట వానికి అంగనిర్మాణ మేర్పరచుట అవసరమగుచున్నది. ఇప్పుడు సహజముగ ఉన్న సంఘ విభాగములు కులమును బట్టియు వృత్తులను బట్టియు ఉన్నవి. పౌరకార్యముల కొరకు కృత్రిమములగు పద్ధతులతో క్రొత్త జట్టుల నేర్పచినచో, విజ్ఞానములేని జన సామాన్యమునకు అంత యిష్టముగానుండదు. వేర్వేరు హక్కులుకలవారి సమూహములు ఏర్పరచుటలో ఏయే కష్టములు ఆచరణమునందు కలుగునని మేము వెనుక ఈ నివేదికలో చూపి యున్నామో, ఆ కష్టములే ఈ విషయమున గూడ ఎదుర్కొన గలవు. అయినను, ఈ పద్ధతిని గ్రామ పంచాయతీలలోను, మునిసిపాలిటీలోను, అవసర మైన సందర్భములలో ప్రవేశ పెట్టి పరీక్షించవచ్చునని మాతలంపు శాసనసభా సభ్యుల ఎన్నికలవరకు ఈ పద్ధతిని వ్యాపింపచేయుట మా యభిప్రాయముకాదు. ఇదికాక, మ. ఘ. వ. ప్రభువుగారి ఫర్మాను (౧౩ జమాదిస్సాని ౧౩౩౯ హిజ్రి)లో ప్రత్యక్షముగా వోట్ల పద్ధతియే ఆజ్ఞాపించబడినది. కనుక పరోక్షమగు వోట్ల పద్ధతి ఫర్మానులోని ఆజ్ఞకు విరుద్ధముగా నుండునుకదా !

## స్త్రీలకు వోట్ల హక్కు

స్త్రీలకువోట్ల హక్కునిచ్చు విషయమున చిక్కులు కలవు. స్త్రీలలో విద్య విపరీతముగా లోపించియుండుట, సాంఘికాచారములు, సాధారణముగా జనుల యందుగల భావములు, స్త్రీలకు వోట్లహక్కు నిచ్చుటకు ఆటంకములుగా నున్నవి. మొత్తము జనసంఖ్యలో ఇంచుమించుగా సగముమంది స్త్రీలు. ఇరువది సంవత్సర

ములకంటె మించిన వయస్సుగలిగి చదువు వచ్చిన స్త్రీలసంఖ్య మనరాష్ట్రమున ౩౦ వేల ౧౯౦. గ్రామములలోని స్త్రీ పురుషులకు వోటిచ్చుటకై కావలయునని మేము నిర్ణయించిన విద్యాయోగ్యత ప్రకారము, సుమారు ౨౫ వేల మంది స్త్రీలకు వోటు హక్కు దొరకగలదు. నగరమునందును, జిల్లాప్రధాన స్థలములందును, ఇతర స్థలములందును వోటిచ్చుటకు మేము నిర్ణయించిన ఆస్తిసంబంధమగు యోగ్యత, స్త్రీ పురుష భేదములేకుండ, అందరికి సమానముగా వర్తించుచున్నది. అయినను, తమపేర ఆస్తిగల స్త్రీలసంఖ్య చాల కొద్ది; కనుక ఆస్తిగలవారను కారణమువలన వోటిచ్చు హక్కు పొందువారి సంఖ్య ౨౫ వేలకంటె మించజాలదు. ఈ కారణమువలన, తమ స్వంతహక్కును బట్టి ఆస్తికలవారగు స్త్రీలుమాత్రమేకాక, ఎవరెవరి భర్తలు ఆస్తికలవారో అట్టిస్త్రీలకుకూడ వోటు హక్కు ఉండవలయునని మేము సిఫారసు చేసియున్నాము. బ్రిటిషిండియాలోని అనేక ప్రాంతములలో, స్త్రీలను ఎక్కువ మందిని వోటర్లుగా నుండునట్లు చేయుటకై వారికి అధికముగా నీయోగ్యత కల్పింపబడినది. ఎవరెవరి భార్యలకు వోటిచ్చు హక్కు ఇప్పింపవలయునని ఉద్దేశించబడినదో, అట్టి పురుషులకు ఆస్తిసంబంధమగు యోగ్యత అసాధారణముగా హెచ్చించబడినది. స్త్రీ వోటరుల పట్టికలు సిద్ధపరచుటలోను, వారి ఎన్నికలు నిర్వహించుటలోను, ఏర్పాటులు చేయుటలోను కలుగబోవు కష్టములను దృష్టియందుంచుకొని, ఆస్తిసంబంధమైన యోగ్యతలను వారి విషయమున హెచ్చుగా నిర్ణయించి యున్నాము. కౌన్సిలు సభ్యులను ఎన్నుకొను వోటరుకు ఎట్టి ఆస్తి సంబంధమైన యోగ్యతను సూచించియున్నామో, అట్టి దానినే స్త్రీలకొరకు అధిక యోగ్యత క్రింద నిర్ణయించితిమి. ఈ విధముగా వోటిచ్చు హక్కునుపొందు వారి సంఖ్య లక్షకంటె కొంచెము హెచ్చుఅగును. అనగా మొత్తము స్త్రీవోటర్లు ౧ లక్ష ౫౦ వేలమంది యగుదురు. యథార్థమున నీ సంఖ్య చాల తక్కువయని కమిటీవారికి స్ఫురించుచున్నది. అయినను ప్రస్తుత పరిస్థితులలో ఇంతకంటె హెచ్చించుటకువీలులేదు.

## నియోజక వర్గము (Electorate)

అన్నిటికంటె అనుకూలమైనదియు, శ్రేష్ఠమైనదియునగు నియోజకవర్గ పద్ధతి ప్రాంతీయ ( territorial ) పద్ధతియే కనుక మేమును సాధారణ నియోజక

వర్గములలో ప్రధానముగా దీనినే సిఫారసుచేసి యున్నాము. మాకు వచ్చిన జవాబులలో ఒక జవాబైనను, మా కమిటీ సభ్యులలో ఒక సభ్యుడైనను, మతనియోజక వర్గములు (Communal electorates) గాని మతములనుబట్టి వ్యష్టి నియోజకవర్గములు (Separate electorates on communal basis ) గాని ఉండవలయునని కోరియుండలేదు. ఇందునకు కమిటీవారు చాల సంతోషించుచున్నారు. పూర్తిగా ప్రాంతీయములగు సమిష్టి నియోజకవర్గములే యుండవలయునని కమిటీవారు ఏకగ్రీవముగా నంగీకరించిరి. దీనిని మేము గొప్ప విజయముగా భావించుచున్నాము. జిల్లాల ప్రధాన స్థలములను స్వతంత్రములగు నియోజక మండలములుగా నేర్పరచుచు, జిల్లాలోని ఇతర స్థలములను గ్రామములతో గలిపి నియోజక మండలముల నేర్పరుపవలయునని, ఎంతో జాగరూకతతో పరిశీలించినమీదట నిశ్చయించితిమి. హైదరాబాదు నగరము అత్రాఫుబల్దా జిల్లాకు ప్రధాన స్థలముకూడ అయి యున్నది. కనుక దీనికి ౧౬గురు ప్రతినిధుల నంపు అధికారము ఉండగలదు. ఈ నగరమును వార్డులుగా భాగించవలసి యుండును మొత్తము ౭౮ మంది ప్రతినిధులను పంపునట్టి ౧౬ జిల్లాలు, ఒక్కొక్క ప్రతినిధి నెన్నుకొనుట కొక్కొక్క భాగముండునట్లు ౭౮ అంతర్భాగములుగా విభజించబడవలసి యుండును. స్త్రీలును, ఆదిహిందువులును ప్రత్యేక హక్కులు కలవారుగా నేర్పరచి, స్త్రీలకు ౫ సీట్లును, ఆదిహిందువులకు ౧౦ సీట్లును ఉండవలయుననియు, అట్టి ప్రతినిధులను, వరుసగా, స్త్రీలసంఘములును, ఆదిహిందూ సంఘములును ఎన్నుకొనవలయుననియు, మేము సూచించినాము. సాంకేతికముగా చూచినచో, వీరిని ప్రత్యేక హక్కులవారుగా నేర్పరచుట సరికాదు; కాని సాధారణ నియోజక వర్గములవలన వీరు ఎన్నుకొనబడుట సంభవించదేమోయను సందేహముచే వీరికి ప్రత్యేక ప్రాతినిధ్యమిచ్చుచు, సాధారణ నియోజకమండలములోగూడ పోటీచేయు నధికారమును నిలిపియుంచుచున్నాము. మాకమిటీలో నుండిన సభ్యురాండ్రును, ఆదిహిందూ సభ్యులును, కమిటీవారి యీ సూచనలతో నేకీభవించి యున్నారు.

## సీట్లను ప్రత్యేకించుట

మతము, కులమునుబట్టి సీట్లను ప్రత్యేకించ వలసినదని కోరినవారు, మహమ్మదీయులు, ఆది హిందువులు మాత్రమే. అయినను, ఈ సూచనలోనైనను

వారందరును ఏకీభవించి యుండలేదు. కొందరు మహమ్మదీయ సోదరులు తమ మతస్థులకొరకు సీట్లను ప్రత్యేకించుట బొత్తిగా అనవసరమని కఠినముగా విమర్శించిరి. అదే విధముగా, ఆదిహిందువులలో గూడ సీట్లను ప్రత్యేకించుమని అందరు కోరలేదు. మా కమిటీలోని ముస్లిము సభ్యులు కొందరు, సీట్లను ప్రత్యేకించుటయనగా నొక విధమున మతవైమనస్యమేయని తత్వతః ఒప్పుకొనుచు, ముస్లిము మతస్థులగువారు ఈ విషయమున అనుమానము ప్రకటించుచున్నారు కనుక తమ మతస్థులకొరకు సీట్లను ప్రత్యేకించుట ఆపద్ధర్మముగా అంగీకరించ దగుననియు, ఇట్లుచేసినచో వారికి తృప్తి కలుగగలదనియు కోరిరి. కొందరు సభ్యులు ఈ విషయమునుగురించి ఇష్టాగోష్టిగా మాట్లాడి, సమన్వయించుకొని అట్టి సూచనలు చేయుటకు నియమించబడియుండిరి. కాని కాలవ్యవధి చాల తక్కువగా నుండుటచేత ఇష్టాగోష్టి సంభాషణలు అసంపూర్తిగనేయుండినవి. కనుక సీట్లలో నూటికి యిన్ని వారికై ప్రత్యేకించబడవలయునని స్థిరపడలేదు. సీట్లు ప్రత్యేకించు అవసరము కలుగకుండ మరేదైన యుపాయము కలదేమో చూడవలయునని ఆలోచింపబడినది. హైదరాబాదు నగరమునకు ౧౬ సీట్లు నిర్ణయించుటయు, జిల్లా ప్రధాన స్థలముల పక్షమున అనేక సభ్యులు ఎన్నుకొనబడునట్లు నియోజక మండలముల నేర్పరచుటయు, ఈ యుద్దేశమును చాల వరకు నెరవేర్చ గల్గును. మా కమిటీ సభ్యులలో అధిక సంఖ్యాకులగువారి నమ్మకమేమనగా, ఇప్పుడు మేము సూచించిన సీట్లపంపకము, మహమ్మదీయ సోదరులకు మొత్తముమీదగల సాంఘిక గౌరవము, అర్థిక గౌరవము, ఈ రెండునుకలిసిన మీదట, సీట్లు ప్రత్యేకించబడకపోయినను, వారికి చాలినంత ప్రాతినిధ్యము తప్పక లభించగలదు.

మా ఉపసంఘముల సమిష్టి సమావేశములలో ఆదిహిందువుల సమస్య ఏకగ్రీవముగా తృప్తికరమగు విధమున పరిష్కరింపబడినది. తమ జనసంఖ్యను బట్టి తమకు సీట్లు ప్రత్యేకించబడ వలయునను వాదమును వారు పై పరిష్కారమును ననుసరించి వదలుకొనిరి. ప్రత్యేక హక్కుల క్రింద వారికి ౧౦ సీట్లు ఏర్పరుపబడినవి; అదికాక వారు సాధారణ నియోజక మండలములలో గూడ పోటీచేయుటకు అధికారము కలిగియుందురు. ఆదిహిందూ వోటర్లకుండవలసిన యోగ్యతలలో మేము హెచ్చించిన సూచనవలన, వారికి తమవారిని తగినంత మందిని శాసనసభలకు పంపు నవకాశములు బాగుగా లభించగలవు.

నోటు:— హైదరాబాదు (దక్కన్) యొక్క యూనాని వైద్యుల సంఘమువారును, నిజాం ఆయుర్వేద తిబ్బీ యూనాని కాన్ఫరెన్సు కమిటీవారును, సెంట్రలు ఆయుర్వేద వైద్య సంఘమువారును, అలోపతి (Allopathy), ఆయుర్వేదము, యూనాని, ఈ మూడు విధములగు వైద్య పద్ధతులకు సంబంధించిన వైద్యులకు ప్రతినిధులుగా అధమ పక్షము ముగ్గురిని శాసనసభలకు పంపు వీలు కలిగించ వలయునని మా కమిటీవారిని కోరిరి. పై మూడు వైద్యవిధానముల పక్షమున మూడు ప్రత్యేక నియోజక వర్గములను ఏర్పరచవలయుననియు వారిలో నొక్కొక్క దాని పక్షమున నొక్కొక ప్రతినిధి ఎన్నుకొన బడవలయుననియు వారు సూచించియున్నారు.

హైదరాబాదులోని ఇండియన్ మెడికల్ అసోసియేషను వారీక్రింది తీర్మానమును మాకు పంపిరి:- మునిసిపలు సంఘములలోను, శాసనసభలలోను, ఇతర ప్రజాసంఘములలోను, వైద్యులయొక్కయు వైద్యబోర్డుయొక్కయు ప్రతినిధులుండుట, ప్రజారోగ్య విషయములలో వారి యాలోచన లభించుటకై అవసరము.

ఆంగ్లో ఇండియనులను ఈ కమిటీవారు ప్రత్యేక హక్కులు కలవారిగా నిర్ణయించియున్నారు.



# మూడవ భాగము

## (అ). స్థానిక స్వపరిపాలనము

### సామాన్య విషయములు.

భారత దేశము యథార్థమున పల్లెటూళ్ళ దేశము. జాతీయ జీవనము యొక్క అన్ని విభాగములందును, —— ఆర్థికముగాని వైజ్ఞానికముగాని, సాంఘికము గాని, రాజకీయముగాని, ప్రతిదానియందును —— ఈ విశిష్టత ప్రతిబింబించుచున్నది. భారత దేశముయొక్క సాంఘికమగు రాజకీయ విధానపు పునాదులు పురాతన నమునుండి ఇప్పటివరకు గ్రామసంఘములే. ఇవి విశాలమగు కేంద్రరాష్ట్ర సంఘటనములో నంతర్గత భాగములుగా పనిచేయుచున్న దాదాపు స్వతంత్ర సంస్థలుగా నుండినవి. స్వతంత్రమగు స్థానిక స్వపరిపాలనాసూత్రము గ్రామీణమగు భారత దేశమువలన ప్రపంచ రాజ్యాంగ విధానమున కొసంగబడిన యమూల్యమగు కానుక. పురాతన గ్రామ పంచాయతీసంస్థ యొక కేంద్ర ఫేడరల్ విధానమున కంతర్గత ముగా పనిచేయుచుండెనను విషయ మందరికిని సువిదితమే ఏసంస్కరణమును ప్రవేశపెట్టినను ఈ కార్య విభజన సూత్రముపై నిర్మింపబడినచో నవి సఫలమగును; లేనిచో ఎరువుదెచ్చుకొనిన భావములవలె నిష్ఫలములై యుండును.

ఈ స్వతంత్ర సంస్థలు ఇటీవల చాలవరకు శిథిలములైనవను మాట వాస్తవము. కాని ఈ భావము ప్రజలందు గాఢముగా నాటుకొని యున్నందున అత్యంత కేంద్రీకృతమగు వర్తమాన ప్రభుత్వ విధానమందును ఈ గ్రామసంస్థల ప్రారంభదశలను, రాజకీయ విభాగమునందు కాకపోయినను, గ్రామముల ఆర్థిక సాంఘిక జీవనములలో జూచుచున్నాము. భారత దేశము అర్థికమగు ప్రస్తుత సంచలనము కేగాక, పూర్వము ఇతర దేశములకంటె అసంఖ్యాకములగు రాజకీయ మత విప్లవములకు గురియైనది కాని గ్రామసంఘములీ తుఫానులనన్నిటిని జయప్రదముగా నెదుర్కొనినవి. ఈ విశిష్టతయే భారత రాజ్యాంగ నిర్మాణమందు ఈ సంస్థలకు గల ప్రబలమగు ప్రాముఖ్యతకు తార్కాణము. ఇందువలన ప్రస్తుతము పనిచేయుచున్న స్థానిక సంఘములను ( Local bodies ) పరిపూర్ణముగా విశాలమగు పునాదులపై పునర్నిర్మించి వాటిని ప్రజాభిప్రాయమును వ్యక్తపరచు నిజమగు ప్రతినిధి

సంస్థలుగా మార్చకపోయినచో రాష్ట్రముయొక్క రాజ్యాంగ సంస్కరణము సంపూర్తికానేరదు. ఈ సంస్థలయొక్క ముఖ్యోద్దేశము ఏమనగా: కేవల స్థానికములగు విషయములను అనుదినము తమ జీవితములలో వాటివలన గలుగు కష్టసుఖముల ననుభవించు స్థానికులే సహజముగా ఎక్కువ కుశలతతో పరిపాలింతురు. కావున అవి వారికి వదిలివేసి ప్రభుత్వము వారి నట్టివిషయముల పరిపాలనా భారమునుండి కాపాడుటయే. హైదరాబాదవంటి రాజ్యముయొక్క ఏకైక రాష్ట్రవిధానమునందు గ్రామపంచాయతీల సంస్థాపనము ప్రభుత్వమును ప్రజానురంజకముగా నొనర్చుటకు ప్రబలమైన సాధనము. ఈ సంస్థలు అనుకూలములగు పౌరసత్వశిక్షాలయములుగా నుండును. రాజ్యాంగశక్తి రాష్ట్రశాసనమునకు లోబడినట్లే అంతర్గతములగు ఈ చిన్నచిన్న సంస్థలయొక్క స్వయం నిర్ణయ స్వయం సహాయశక్తులపై నాధారపడి యుండును. సాంఘిక రాజకీయ విధానమునకు మూలస్థంభమగు నీ సూత్రమే బల కారకమై కాల పరివర్తనముచే గలుగు నాఘాతముల నన్నిటిని ఎదుర్కొనుశక్తి నొసంగును.

## లోకల్ ఫండు కమిటీలు; వాటి ప్రస్తుత స్థితి.

మా ప్రశ్నావళికి జవాబులిచ్చిన వారందరు ఏకగ్రీవముగా జిల్లా తాలూకా లోకల్ ఫండు కమిటీల ప్రస్తుతస్థితి బొత్తిగా అసంతృప్తికరమై యున్నదని వక్కాణించియున్నారు. అవి ప్రజాయత్త సంస్థలుగా నిర్మింపబడలేదు, వాటియొక్క కార్యవిధానమునందుగాని, కార్యరంగమునందుగాని ప్రజాభిప్రాయము ప్రతిబింబించుట కవకాశము లేశమాత్రములేదు. తాలుకుదారులేక తహశీలుదారు ఉద్యోగరీత్యా అధ్యక్షులుగానుండి ఈ సంస్థలు కేవలము జిల్లా తాలూకా ప్రధానస్థలములయొక్క ఆరోగ్యావసరములను మాత్రము పూర్తిజేయుటకు పూనుకొనుచు తమ హద్దులలో నున్న గ్రామీణుల యవసరములపై లేశ మాత్రము దృష్టిని ప్రసరింప జేయవు. ఉద్యోగేతర సభ్యులు ప్రభుత్వమువలన నియమితులగుటవలన వారికి అస్సలు పరిపాలనా విధానములో బొత్తిగా పలుకుబడియేలేదు. కమిటీల కార్యరంగమే అతిసంకుచితమై వాటి ఉద్యోగులగు అధ్యక్షులయొక్క దృష్టికూడ కేవలము తమ యవసరముల వరకే సంకోచమొందుచుండును. కార్యనిర్వాహణాధికారము అధ్యక్షునకు చెంది యుండును. మరియు సభ్యులు ప్రజాభిప్రాయమునకు ఉత్తరవాదులు కారు. అంతే కాదు. వారు సాధారణముగా ప్రజాభిప్రాయమును గమనించరు. ఈ సంస్థలయొక్క

పరిపాలనమును గురించి అనేక సారులు ప్రజలు మొరపెట్టుకొనిరి. మా ప్రశ్నావళి కుత్తరమొసంగిన వారిలో ననేకులు వివిధ స్థానిక సంస్థల అధికారేతర సభ్యులగుట సంభవించినది. వీరిలో నొకరును ఈ సంస్థలయొక్క ప్రస్తుత స్థితులను సంతృప్తికరముగా నున్నటుల తలంచుటలేదు. అంతేకాక, వీరు ఈ సంస్థలిప్పుడు ప్రజావసరములనెట్లు పూర్తి నొనరించుటలేదో వివరములతో తెలిపియున్నారు. కావున ఈ సంస్థలను ప్రజాయత్తములుగాను లాభకరములుగానుండు పునాదులపై స్థాపించి స్థానిక పరిపాలనమును యుక్తములగు సాధనములుగా మార్చవలెనన్నచో, వీటి పునర్నిర్మాణము సంపూర్ణముగా నవసరమని మేము తలంచుచున్నాము. అందువలన మేము మూడు విధములగు ప్రత్యేక సంస్థలను, అనగా గ్రామ పంచాయతీలు చిన్న మునిసిపాలిటీలు జిల్లా సంఘము, స్థాపించవలయునని సూచించియున్నాము. మేము సూచించిన విధానము క్రింద తాలుకా లోకల్ ఫండు కమిటీ లనవసరములగును. హైదరాబాద పురపాలకా సంఘము విషయమున మేము బుద్ధిపూర్వకముగానే, ఏ సూచనల నొనరించలేదు. ఏలయన ఆ సంస్థల ఇటీవలనే పునర్నిర్మింపబడి అందులో నవసరమగు మార్పులు సమయానుసారము చేయబడుచున్నవి. అనతి కాలములో వార్డుల విభజనయొక్క అసమత్వము తొలగించబడి ప్రజానియోజక పద్ధతి సవరింపబడి విస్తరింప బడెవలెనని మాత్రము తలంచుచున్నాము.

## పునర్నిర్మాణము.

ప్రస్తుత లోకల్ బోర్డులను పూర్తిగా సవరించి వేయుటకును, ప్రజల యధికారమును ప్రవేశ పెట్టుటకును జిల్లా సంఘములో ¾వవంతు సభ్యులు ప్రజలచే ఎన్నుకొనబడవలెనని మేము సూచించినాము. కొంతకాలమువరకు కొలది సభ్యులు ప్రభుత్వ నియమితులు కూడ నుందురుకాని మేము సూచించిన విధమున పునర్నించినచో వారు కూడ ఈ సంఘములకు సహాయ కారకులే యగుదురు. ఈ విధములగు సంఘముల సంబంధమున ఇతర స్థలములలో అమలులో నున్నట్టి యొక సంప్రదాయమును తెలుపుట సమంజసమని భావించుచున్నాము. ఉద్యోగులైన అధ్యక్షులు అధికారేతరులైన ఉపాధ్యక్షులపై సంఘముల కార్యభారమును వేయుదురు. అనివార్యమయినపుడు తప్ప, సామాన్యముగా సంఘకార్యములలో ఏ విధముగను జోక్యము తీసుకొనరు. చిన్న చిన్న మునిసిపాలిటీలను స్థాపించుటకై మేము

గావించిన సూచనలు ప్రభుత్వమువారి ఎదుటనున్న కసుబా సంఘముల చిత్తునియమము లకంటె వేరు విధముగా నుండును. రెండు వేల జనసంఖ్యగల పెద్ద గ్రామములనన్నిటిని మునిసిపాలిటీలుగా నేర్పరచ వలననియు, వాటికి మునిసిపలు అధికారములు అధికముగా నియ్యవలయుననియు మా సూచన. ఈ సంస్థల సీవిధముగా మార్చినచో ఇవి పరిపాలనమున కెక్కువ తోడ్పడ జాలవని మా నిశ్చితాభిప్రాయము.

## గ్రామ పంచాయతీలు.

మన దేశములో స్థానిక స్వపరిపాలనము యొక్క ఏ ప్రణాళికలో నైనను గ్రామములు సహజముగా ప్రాధాన్యత వహించును. ఇంచుమించుగా ౨౧౦౦౦ గ్రామములు మన రాష్ట్రములో తమ తమ యవసరములను గలిగి వానినెరవేర్చుకొనుటకై నిరీక్షించుచున్నవి. జాతీయ పునర్నిర్మాణము, లేక, గ్రామోద్ధరణము యొక్క ఏ ప్రణాళికయు గ్రామ పంచాయతీల సక్రమ విధానమును ప్రవేశ పెట్టనిదే విజయవంతము కానేరదు. మైసూరు, బరోడాల మాటయటుంచి తిరువాన్కూరు కొచ్చినువంటి చిన్న చిన్న సంస్థానములు గూడ గ్రామపంచాయతీల విధానమును చిర కాలము క్రిందనే ప్రవేశ పెట్టినవి. ఈ విషయమగు సంస్కరణములు చేయుటకిది వర కేమిగుల ఆలస్య మైనదని చూపించుచు తక్షణమే ఈ విధానమును నియమిత కాలములో పై ౨౧౦౦౦ గ్రామములన్నిటిని చేర్చుకొనునట్టు విశాల పద్ధతి పైన ప్రవేశ పెట్టవలయునని సూచించు చున్నారము.

ఒక వేయి లేక ఎక్కువ జనసంఖ్య గల ప్రతి గ్రామమున నొక పంచాయతీ ఎన్నికల పద్ధతిపై ఏర్పరచవలెనని సూచించినాము. వేయికంటె తక్కువ జనసంఖ్య గల గ్రామములను జట్టులు (group) గా సుమారు వేయిజనసంఖ్యకొక గ్రామ పంచాయతీ ఏర్పడునట్లు విభజింపవలెను. ప్రతి దశాబ్దములోని జనపరిగణ ప్రకారము ప్రతి గ్రామము యొక్క వయో జనులలో ప్రతి నూరుగురి తరఫున నొక ప్రతినిధి గ్రామ పంచాయతీకి ఎన్నుకొన బడవలయును. సభ్యుల సంఖ్య జనసంఖ్య ననుసరించి మారుచుండును కాని ఎప్పుడును ౭ కంటె తక్కువ ఉండగూడదు. అధమము ఈ సంఖ్యలో సగముమంది సభ్యులు గ్రామీణులగు వయోజనులు (major) అయిన వారందరి చేతను సూటిగా (direct) ఎన్నుకో బడవలెను. కమిటీవారు గ్రామ పంచాయతీల ఎన్నికలలో స్త్రీలను చేర్చుకొను సమస్యపై బాగుగా నాలో

చించిరి. కాని అట్లుచేయుటకు వారికి ప్రబలమైన కోరిక యుండినను ప్రస్తుతము గ్రామ స్త్రీలకు ఈ సంస్థలలో ఓట్లు హక్కు ఒసంగ కూడదనియే తీర్మానించిరి. కాని కమిటీవారు, మరొకచో గావింపబడిన తమ సూచన ప్రకారము, కాబోయే పునర్విచారణ సందర్భమున నియమిత కాలము తర్వాత, ఈ విషయము పునరాలోచింపదగినదని సూచించుచున్నారు.

పంచాయతీల కుండవలసిన అధికార బాధ్యతల విషయము కమిటీ సభలలో బాగుగా చర్చ జరిగినది. స్థానిక సంఘములు (Local Boards) పంచాయతీలు మున్నగువాని కర్తవ్యము బహుశః ఆచారమును వర్తమాన కాలపు అవసరములను, పౌరత్వాదర్శములను బట్టి యుండుటచే, ఒక్కొక్క సంస్థానమునకు ఒక్కొక్క ప్రాంతమునకు అవి వేరు వేరుగా నుండవచ్చును. ప్రాథమిక పౌరస్వత్వ కర్తవ్యములు మొదలుకొని మాల్గుజారి, పోలీసు అధికారములు కూడ సమగ్రముగా ఇచ్చుచున్నారు. కొన్ని ప్రాంతములలో వారికి న్యాయవిచారణాధికారములు కూడ గలవు. ఇతర స్థలములలో గ్రామ పంచాయతీలకుగల యధికారముల విషయము గమనించితిమి. కాని మన గ్రామముల యొక్క ప్రస్తుత పరిస్థితులను, గ్రామీణుల విద్యా విహీనతను గలవారికి, బాధ్యతాయుత సంస్థలయొక్క యనుభవ లోపమును గమనించక తప్పదు. ఈ కారణమున గ్రామ పంచాయతీలకు ఇప్పుడు న్యాయాధికారము లొసంగుట ఉచితమని తలంచలేదు. అట్లే ప్రజా విద్యాశాఖ, రక్షక శాఖలను వీటి అధికార బాధ్యతలందు చేర్చుటకు సూచించలేదు. పంచాయతీలు తమ పనులను ప్రభుత్వము వారిచే గావింపబడిన పరిపాలనా సంబంధములగు నియమముల ననుసరించి నిర్వర్తించును. పంచాయతీలు చేయవలసిన విధిపూర్వకమగు పనులను, వారిష్టముపై చేయదగిన కార్యములను వివరముగా సిఫారసుల భాగములో వివరించి యున్నాము.

### (ఆ) ప్రాథమిక హక్కులు.

మా ప్రశ్నావళి కుత్తరము లొసంగిన వారందరును వాక్స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము మున్నగు ప్రాథమిక హక్కుల రక్షణకై శాసన రూపమున నిబంధనలు (Statutory provisions) యేర్పడ వలయునని పట్టుదలతో అభిప్రాయముల నిచ్చియున్నారు. ఒకరైనను కాదనక, అందరు ఈ యంశము నతి తొందరగా తేల్చవలయునని త్వరపెట్టు చున్నారు. మొట్ట మొదట

'మీరీ హక్కులను పొందుటకై ప్రయత్నించి అవలంభించిన విధము కొంచెము స్వతంత్ర వాతావరణము ఏర్పడిన తరువాత రాజ్యాంగ సమస్యల విషయమును విచారణ చేయవలసినద'ని అనేక ఉత్తరములు వచ్చియున్నవి. వ్రాసిన వారిలో మహారాష్ట్ర సంపాదకులు 'ఎంత విశాల హృదయముతో సంస్కరణము లొనరించినను ప్రాథమిక హక్కులు నొసంగక పోయినచో అవన్నియు వ్యర్థము'లని ఖండితముగా అభిప్రాయము పడుచున్నారు. వారి ఈ పట్టుదలకు కారణములు దురూహ్యములు కావు. చాల కాలమునుండి ప్రజలు పైన వివరించిన పౌరసత్వముల లాభమును బొందనియ్యనందుచేత జీవితముయొక్క సర్వశాఖలందును ఈ నిర్బంధమువలన వారి యభివృద్ధి అరికట్టబడినది. రాష్ట్రము తొందరగా యభివృద్ధి, సంస్కరణ మార్గమును త్రొక్కలేక పోవుటకు వీటిని సమర్థించు ప్రజాభిప్రాయమును సిద్ధపరచు సాధనములలో నిదే ముఖ్య హేతువు.

ఈ హక్కులలో ముఖ్యతమమైన ప్రధాన తరగతికి చెందిన వివిధ పునర్నిర్మాణములకు పునాదియైన హక్కు నిస్సంశయముగా వాక్స్వాతంత్ర్యము. సంఘ జీవనము యొక్క జీవమే అభిప్రాయ ప్రకటనము; దానిలోపమువలన అనగా నిర్బంధమువలన అభ్యున్నతి యసంభవమగును. హైదరాబాదుయొక్క పౌరత్వ రాజకీయ జీవనము నేడు తగినంత యభివృద్ధి నొందియుండక పోవుట ఎవరికిని ఆశ్చర్య జనకము కాగూడదు. ౧౭వ దై ౧౩౩౯ ఫ. నాడు జారీచేయబడిన ౫౩వ సంబరుగల గస్తీ (Circular) పైన, మా ప్రశ్నావళికి ప్రత్యుత్తర మొసంగిన ప్రతి వ్యక్తియు ప్రతి సంస్థయు తీవ్రమగు నాక్షేపణ అనంగీకారమును ప్రకటించెను. జవాబులలో నొకరు వర్ణించినటుల, "ఈ గస్తీ మూలమున రాష్ట్రములోని సార్వజనిక జీవితము సంపూర్ణముగా త్రొక్కివేయ బడినది." వాక్స్వాతంత్ర్యము యొక్క ప్రధానావశ్యకతను ప్రజలు గ్రహించక పోలేదు. ఒకసారిగాదు అనేక సారులు, ఒక స్థలమునుండి కాదు పలు ప్రదేశములనుండి పలు వేదికలనుండి, ఈ గస్తీని రద్దు పరచుటకై ప్రార్థనచేసిరి. ఈ ఆజ్ఞను రద్దు పరచవలసినదని కోరుచు సభలు జరుపబడినవి. ప్రభుత్వమువారి వద్దికి రాయభారములు (deputations) వెళ్ళినవి. వినతి పత్రములు పంపుకొనబడినవి. ఇప్పుడు యోచింపబడుచున్న రాజ్యాంగ సంస్కరణల సంబంధమగు ప్రభువుగారి ప్రకటనము గావింపబడినట్టి యత్యంత సమంజసమగు సందర్భమునగూడ కొందరు వ్యక్తులును, సంస్థలును ఈ విషయమున గట్టి విజ్ఞాపనము గావించెను.

ఈ గస్తీ యొక్క వివరములన్నింటిని వాకుప్రచ్చి బహిరంగ సభలు సమావేశ పరచుట కెట్టియెట్టి అటంకములను కలిగించుచున్నదో, యెట్టి దుష్కరములగు షరతుల నారోపించుచున్నదో ఏకరువు పెట్టుట యనవసరమే కాక నిరుపయోగము కూడ అయియున్నది. ఈ గస్తీ సభల సమావేశమును, అభిప్రాయ ప్రకటనమును స్పష్టముగా నిరుత్సాహపరచి నిరోధించుచున్నదని చెప్పజాలును. ప్రభుత్వము వారి కనేక సారులు హృదయ వేదనతో నివేదించుకొనినట్లు, ఈ గస్తీ ప్రకారము దుఃఖ ప్రదర్శన సమావేశములు (స్మారక సభలు) కూడ ఆజ్ఞలేనిదే జరుగరాదు. అనేక సారులు అభ్యర్థితమగు నాజ్ఞ సమయము దాటిన తర్వాతగాని లభింపదు. అదియును ఈ కష్టతరమగు బహుళమైన ఉత్తర ప్రత్యుత్తరముల తర్వాత. ఈ రాష్ట్రములో సభలు సమావేశపరచు ప్రయత్నములుచేసి యనుభవము గడించిన వారికి ఈ మార్గములోని నిర్బంధముల కాఠిన్యములేక దుష్కరత్వము బాగుగా గోచరించును.

వాక్స్వాతంత్ర్య సమావేశస్వాతంత్ర్య లోపములు విద్యావంతులగు వారిని గలంచుచుండ, ఊరేగింపులు మున్నగు వాటిపై గావింపబడిన నిర్బంధములు ప్రజాసామాన్యముయొక్క హక్కులనరికట్టుచున్నది. ప్రజలయొక్క ధార్మిక సామాజిక జీవనము ఉండినపుడు ఉత్సవములు ఊరేగింపులు మున్నగు వాటిద్వారా వెల్లడియగుచుండును. వారికిగల సాంస్కృతిక జీవన రూపనమున నే వ్యక్తపడుచు ఇట్టి సాధనములపై యాధార పడియుండును. వాటి మార్గము నాటంకపరచునటుల జోక్యము కలిగించుకొనుట పురోగామియగు వారి జీవిత రథచక్రముల కడ్డుగట్టులను బెట్టుటయగును. అనేక సారులు విధిపూర్వకముగా నియమిత దినములందు జరుపబడు మతవిషయకములగు యుత్సవములును సకాలమునకు అవసరమగు ప్రభుత్వాజ్ఞ లభింపనందున ముందుకు జరుపబడవలసియో లేక వదులుకొనవలసియో వచ్చినది. చిరకాలము విసుకుచెందక విజ్ఞప్తుల బంపుకొని ప్రయత్నించిన తర్వాత ఆజ్ఞ లభించెనేని ఆయా ఆజ్ఞతో ననుబంధింపబడిన షరతులవల్ల క్రొత్త పరిస్థితు లేర్పడుచుండును. ఈ విధమగు సమావేశముల కాధార భూతమగు పవిత్రత అంతటితో నంతమొంది ఉపజన్యమైన యుత్సాహము సహజముగా నభ్యున్నతికి పోషకములుగాని ఇతర మార్గములందు ప్రవహించును.

ప్రాథమిక హక్కులనుగురించి శాసన పూర్వకమగు నిర్ణయము యొక్క యావశ్యకత నంగీకరించునపుడు ముఖ్యాతి ముఖ్యములగు పౌరసత్వపు హక్కుల

నిరోధించిన యనేక ప్రభుత్వాజ్ఞల యుదాహరణములును, అందువలన జనించిన యాందోళన కలుగజేసిన వివిధ పరిస్థితులును, తద్వారా వృద్ధినొందుచున్న ప్రజల యసంతృప్తియు ఈ కమిటీవారి ఎదుటనుండినవి. ఈ యుదాహరణములను ఇక్కడ బెట్టి చూపుట మాకిష్టములేదు. హైదరాబాదుయొక్క వర్తమాన పరిస్థితుల నెరిగిన ప్రతివానికిది సువిదితమే. ఇట్టి యుదాహరణముల సంఖ్య తీవ్రముగా పెరుగుచున్నదనియు, వానివల్ల దినదిన ప్రవర్ధమానమగు యసంతృప్తి ప్రజలలో కలుగుచున్నదనియు మాత్రము మేము మనవి చేయుచున్నాము. ఈ తరుణమున ప్రభుత్వము వారు ఉదారమగు చర్యను గైకొనవలెననియు, లేనిచో ప్రజలయొక్క నిరుద్ధములైన భావములు బహుముఖములై స్వాభిప్రాయ ప్రకటనకై వాంఛనీయములు కానట్టి మార్గములనవలంబించుటకు ప్రోత్సహించుననియు విన్నవించుటకు సాహసించుచున్నాము. ఈ కారణములవలన రాష్ట్రములో రాజ్యాంగ సంస్కరణముల యొక్క మూలాధారముగ, ప్రజల ప్రాథమిక హక్కులను గురించిన ప్రకటన అత్యావసరమని భావించుచున్నాము.

ఈ ప్రకటన శాసనమందే ఇముడ్చబడవలెనా లేక ప్రభువుగారి సందేశ రూపకముగ ప్రకటింప బడవలెనాయను విషయము కమిటీయొక్క సభలలో చర్చింప బడినది. మహాఘనత వహించిన ప్రభువుగారి గౌరవమునకును ఘనతకును అనుగుణముగ, మన రాష్ట్రమువంటి ప్రభుత్వయొక్క సంప్రదాయములననుసరించి ఈవిషయమున ప్రకటన ప్రభువుగారి సందేశ పూర్వకముగ గావలయునని మిగుల పర్యాలోచన మీదట మేము నిశ్చయించితిమి. అందువలన రాష్ట్ర ప్రజల ప్రాథమిక హక్కులను గురించి ప్రకటన ఏ విధముగ గావలయునో దిగ్దర్శనముగ మాత్రము సూచించినాము.

## పరిషత్తు.

హైదరాబాద ప్రజాపక్ష సమావేశము యొక్క సభ శ్రీ॥ రామాచారి వకీలుగారి ఆబిద్‌రోడు భవనమున ౨౩ ఇస్ఫందారు ౧౩౪౭ ఫ. (౨౯ జనవరి ౧౯౩౮.) తేదిన రాజా పన్నాలాల్ పీతీ యం. యల్. సి. గారి యధ్యక్షతన జరిగెను. మా. హనుమంతరావుగారు పరిషత్తు కమిటీ యొక్క నివేదికను సిఫారసులను ప్రవేశపెట్టి, పరిషత్తువారు వాని నిర్ధృవపరచ వలయునని తీర్మానము నుపపాదించిరి.

సిఫారసులను కొన్నిటిని చర్చించిన పిదప, నివేదికను స్వల్పసవరణలతో సహ సర్వసమ్మతముగా పరిషత్తువారు అంగీకరించిరి. ముందు కార్యములు నడిపించుటకై పరిషత్తువారు ఈ క్రింది సభ్యులుగల కమిటీని నియమించిరి.

శ్రీయుత మా. హనుమంతరావు, అధ్యక్షులు
,, పాండురంగరావు. న. జోషి, బి. ఎ., యల్ యల్. బి., ఉపాధ్యక్షులు.
,, రామాచారి, వకీలు, కోశాధ్యక్షులు.
,, బూ. రామకృష్ణరావు బి. ఎ., యల్ యల్. బి. } కార్యదర్శులు.
,, కృష్ణ శర్మ }
శ్రీమతి పద్మజా నాయుడు.
శ్రీయుత రాజా పన్నాలాల్ పిత్తీ. యం. యల్. సి.
,, రాయ గణపతలాలు, ఎడ్వొకేటు.
,, డి. డి. ఇటాలియా.
,, సయ్యద్ సిరాజుల్ హసన్ తిర్మిజీ.
,, యస్. బి. శర్మ బి. ఏ, బారెట్లా.

# సిఫారసులు.

## శాసన సభ

౧. హైదరాబాదు శాసన సభ రెండు భాగములు కలదై యుండును. ఒకదాని పేరు, హైదరాబాదు లెజిస్లేటివ్ అసెంబ్లీ (Hyderabad Legislative Assembly) రెండవ దాని పేరు, హైదరాబాదు లెజిస్లేటివ్ కౌన్సిలు (Hyderabad Legislative Council)

౨ (అ) రాజు గారి ప్రత్యేక అధికారములకును, అవసర పరిస్థితులలో ప్రత్యేకముగా శాసనములు జారీచేయు విషయమున ఇకముందు చెప్పబడు ప్రకారము ప్రభుత్వమువారికిగల అధికారమునకును లోబడి, శాసనములన్నియు శాసనసభలో ప్రవేశ పెట్టబడి ఆమోదింపబడిన మీదట ప్రభువు గారివలన అంగీకరింపబడిన పిమ్మట శాసనములగును.

(ఆ) శాసనములోని నియమములకు లోబడి, చిత్తుశాసనము శాసనసభయొక్క ఏ భాగము (Chamber) లోనైనను ప్రారంభించబడవచ్చును. ద్రవ్య సంబంధమైన చిత్తుశాసనమును మాత్రము అసెంబ్లీలోనే మొదట ప్రవేశపెట్టవలెను.

(ఇ) శాసనములో వేరువిధముగా విధించబడిననే తప్ప, ఏ చిత్తుశాసనమును ఉభయ శాసనసభల వలనను, సవరణలు లేకుండగాని, ఉభయ శాసనసభలవలన ఒప్పుకొనబడిన సవరణలతోగాని అంగీకరింపబడనిది శాసనసభవలన ఆమోదింపబడినట్టు భావించబడదు.

## అసెంబ్లీ; దాని రచన

3. హైదరాబాదు అసెంబ్లీలో, శాసనము ననుసరించి చేయబడిన నియమముల ప్రకారము నియమింపబడినట్టియు, ఎన్నుకొనబడినట్టియు, సభ్యులు చేరియుందురు. అసెంబ్లీ సభాసదుల మొత్తము సంఖ్య ౨౦౦. వీరిలో 33 ప్రభుత్వమువలన నియమితులైయుందురు. 32 మందిని ప్రత్యేక నియోజక వర్గములవారును ౧3౦ మందిని సాధారణ నియోజకవర్గములవారును, దీనితో జత పరుపబడిన అనుబంధము (అ) ప్రకారము ఎన్నుకొనెదరు. అయినను, ప్రభుత్వమువారు, తాము నియమించునట్టి 33 మంది అధికార అధికారేతరులేకాక, అసెంబ్లీలో ప్రవేశ పెట్టబడినట్టిగాని పెట్ట నుద్దేశింపబడినట్టిగాని ఏదేని చిత్తుశాసనముకొరకు, అట్టి చిత్తుశాసనము యొక్క విషయమును గురించిన ప్రత్యేక జ్ఞానముగాని అనుభవముగాని కలిగియున్న వారిని, ఇప్పటికంటె మించకుండ అధికముగా నియమించవచ్చును. అట్టివారెంతకాలము కొరకు నియమింపబడినారో అంత కాలమువరకు, అట్టి చిత్తుశాసనము విషయములో, అసెంబ్లీ సభాసదులకుండు అన్ని హక్కులను కలిగియుందురు. పైన చెప్పియున్న సభాసదుల సంఖ్యతో వీరి సంఖ్య చేర్చబడును.

## అసెంబ్లీ స్పీకరు

౪. (అ) అసెంబ్లీ సభాసదులు సాధ్యమైనంత త్వరగా, తమలోనిద్దరిని స్పీకరు, డిప్యూటీ (నాయబు) స్పీకరులుగా నుండుటకై ఏర్పరుపవలెను. ఈ స్పీకరు, డిప్యూటీ స్పీకరు పదవులుఖాళీ అయినపుడు, ఆయా సందర్భములకు తగినట్లు, వారిని అదేవిధముగా ఎన్నుకొనవలయును.

(ఆ) స్పీకరుగాని డిప్యూటీ స్పీకరుగాని అధికారము వహించియున్న సభాసదుడు, అసెంబ్లీ మెంబరుగానుండుట ఆగిపోయిన పక్షమున, ఆపదవి ఖాళీ అగును. అతడు తన యుద్యోగమును ఎప్పుడైనను వదలుకొనవచ్చును. లేక, అప్పుడు అసెంబ్లీ సభాసదులుగా ఉన్నవారిలోని అయిదింట నాల్గుభాగములవారు ఏకీభవించిచేయు తీర్మానము ప్రకారము ఉద్యోగమునుండి తొలగించబడవచ్చును. అయినను ఈ కార్యముకొరకు ప్రవేశపెట్టబడు తీర్మానము ఏదియును అట్టి తీర్మానము ప్రవేశపెట్టదలచియున్నట్లు అధమము ౧౪ దినముల నోటీసైనను ఇయ్యకుండ చేయుటకు వీలులేదు.

(ఇ) స్పీకరును, అతడులేనప్పుడు సాధారణముగా అతని కర్తవ్యములను నెరవేర్చుచుండునట్టి డిప్యూటీ స్పీకరును, లేనప్పుడు స్పీకరు పనులను చేయుటకు తగినవారి పట్టికయొకటి అసెంబ్లీ వారు సిద్ధపరతురు. ఈ విధముగా ఎన్నుకొనబడినవారి పట్టికలోనుండి, పైన చెప్పినవారిద్దరును లేని సందర్భములలో, స్పీకరు ఎన్నుకొనబడును.

(ఈ) స్పీకరునకు, డిప్యూటీ స్పీకరునకు, ప్రభుత్వమువారు, ఈ విషయమున నిర్మింపబడియున్న నియమముల ప్రకారము నిర్ణయించిన జీతములు ఇయ్యబడును.

## కౌన్సిలు; దాని రచన

౫. కౌన్సిలులో, శాసనము ననుసరించి చేయబడిన నియమముల ప్రకారము నియమింపబడినట్టియు ఎన్నుకొనబడినట్టియు సభాసదులు ఉందురు. సభాసదుల మొత్తము సంఖ్య ౬౫ ఉండును. వీరిలో ౧౬గురు ప్రభుత్వమువారివలన నియమితులగుదురు. ౧౬గురు అసెంబ్లీలోని ఎన్నుకొనబడిన సభాసదులవలనను, మిగిలిన 33గురు అనుబంధము (ఆ) లో వివరింపబడియున్న ప్రాంతీయ నియోజకవర్గములవలనను ఎన్నుకొనబడెదరు.

3వ నియమములోని నిబంధనలు ఈ విషయమున కూడ వర్తించగలవు.

## కౌన్సిలు అధ్యక్షుడు

౬. కౌన్సిలు సభాసదులు సాధ్యమైనంత త్వరగా, తమలోనిద్దరిని, అధ్యక్షుడు (President), డిప్యుటీ అధ్యక్షుడు (Deputy President) గానుండుటకై ఎన్నుకొనవలెను. ఈ పదవులు ఖాళీ అయినప్పుడు, ఆయా సందర్భములకు తగినట్లు, అదేవిధముగా ఎన్నుకొనవలెను.

౪వ నియమములోని, ఆ, ఇ, ఈ, వాక్యములు, అసెంబ్లీకి ఏ విధముగా వర్తించుచున్నవో కౌన్సిలుకు కూడ అట్లే వర్తించగలవు. "స్పీకరు" "డిప్యూటీ స్పీకరు" అనుమాటలకు బదులు, "అధ్యక్షుడు" "డిప్యూటీ అధ్యక్షుడు" అనియు "అసెంబ్లీ" అను మాటకు బదులు "కౌన్సిలు" అనియు వాడుకొనవలయును,

## ఉభయ సభలలో వోటింగు పద్ధతి

౭. (అ) ఇందుకు భిన్నముగా స్పష్టమగు విధమున విధింపబడిననే తప్ప, ఏదేని ఒక శాసనసభలోను, ఉభయ శాసనసభల యొక్క సమిష్టి సమావేశములలోను, అన్ని విషయములు, అప్పుడు సభకు వచ్చియుండు వోటిచ్చిన సభాసదులలో బహుజనుల అభిప్రాయ ప్రకారము తీర్మానింపబడును అధ్యక్షుడుగాని, స్పీకరుగాని, వారి ఉద్యోగమున పనిచేయువారుగాని అట్టి బహుజనులలో చేరరు వీరు సాధారణముగా వోటు యియ్యగూడదు. సభాసదుల వోట్లు సమానముగా భాగింపబడిన స్థితులలో వీరు అధికవోటు (Casting vote) ఇవ్వవలయును.

(ఆ) సభాసదుల స్థలములలో ఏదైనను ఖాలీ అయియుండినను శాసనసభ పని జరుపవచ్చును. మరియు, వోటిచ్చుటకు హక్కు లేనివారెవరైనను సభలో ఉండెననిగాని, వోటిచ్చెననిగాని, కార్యక్రమములో పాల్గొనెననిగాని తరువాత తెలియవచ్చిన పక్షమున సభాకార్యములు అక్రమములనిపించుకొనజాలవు.

(ఇ) ఏదేని శాసన సభయొక్క సమావేశము జరుగుచుండినప్పుడు అట్టి శాసనసభయొక్క సభాసదుల మొత్తము సంఖ్యలో ఆరవపాలు సభాసదులు లేరని తెలియవచ్చిన పక్షమున, ఆయా సందర్భములకు తగినట్లు, అధ్యక్షుడుగాని స్పీకరుగాని, మొత్తము సభాసదులలో ఆరవభాగము వారు వచ్చువరకు సమావేశమును మార్చవచ్చును, లేక ఆపవచ్చును.

## శాసనసభయొక్క కర్తవ్యములు; అధికారములు

౮. శాసనసభకు ౧ శాసనముల నిర్మించుట, ౨ ప్రశ్నోత్తరములు, 3 తీర్మానములు, ౪ బజెటు (మవాజనా) ను చర్చించుట, అంగీకరించుట ౫ పన్నులువేయుట అను అధికారములు, ఇకముందు దీనిలో వివరింపబడు నిర్బంధములకును, హక్కులకులోబడియు, శాసనము ప్రకారము నిర్మింపబడిన నియమములకు అనుగుణ్యముగను ఉండును.

౯. కౌన్సిలుకుగాని అసెంబ్లీకికాని ఈ క్రిందివాటికి సంబంధించినట్టిఏదేని శాసనమునుగాని విషయమునుగాని ఆలోచించుటకు అధికారము ఉండదు.

(అ) మ. ఘ. వ. నిజాము ప్రభువునకు ఆయన కుటుంబమునకును ఆయన వ్యక్తి మరియు కుటుంబ నిర్వహణమునకును సంబంధించిన అన్ని విషయములు.

(ఆ) మ. ఘ. వ. ప్రభువునకును, హిజ్ మెజస్టీ చక్రవర్తికినిగల పరస్పర సంబంధమును గురించిన విషయములు.

౧౦. కౌన్సిలుయొక్క గాని అసెంబ్లీయొక్క గాని ఏ సభాసదుడును, ముందుగా ప్రభుత్వమువారి అంగీకారము పొందనిది, ఈ క్రిందివానికి సంబంధించినట్టి ఏ యంశమును గురించియు, చిత్తు శాసనముగాని ప్రతి పాదనముగాని, ఉభయ శాసన సభలలో దేనియందును ప్రవేశ పెట్ట గూడదు.

(అ) సర్కారు ఋణము, (Public Debt) దానిపైన వడ్డీ, సింకింగ్ ఫండు (Sinking Fund.)

(ఆ) మ. ఘ. వ. ప్రభుత్వముయొక్క సైన్యముల పోషణ, క్రమశిక్ష.

(ఇ) బహిస్సంబంధములు (external relations) మరియు, ఇండియా ప్రభుత్వము Govt. of India బ్రిటిషు హిందూదేశ ప్రాంతములు, (British Indian Provinces) ఇతర దేశీయ సంస్థానములు, Indian States) వీరికి మధ్యజరిగిన సంధి పత్రములకులోబడియున్న విషయములు.

(ఈ) తత్కాలమున అమలులోనుండిన ప్రభువుగారి ఆజ్ఞలకు ఏదేని విధముగా విరుద్ధములైన విషయములు.

౧౧. ఏదేని మతస్థుల విజ్ఞానమునకునుగాని మతమునకుగాని బాధకముగా నుండినట్టి ఏ చిత్తుశాసన మైనను సరే, శాసనసభయొక్క సభాసదులలో మూడింట రెండుభాగములవారి అంగీకారము పొందియుండిననే తప్ప, ఆమోదించ బడినదిగా ఎంచబడదు.

౧౨. (అ) ఏదైన చిత్తుశాసనము ఉభయ శాసనసభలవారివలన ఆమోదింపబడిన మీదట, అది శ్రీవారి అంగీకారము కొరకు కార్యనిర్వాహక సభ (Executive Council) యొక్క అధ్యక్షుని ద్వారా మ. ఘ. వ. ప్రభువుగారికి పంపబడును.

(ఆ) మ. ఘ. వ. ప్రభువుగారు తన యిష్టానుసారము అట్టి చిత్తుశాసనమును పూర్తిగాగాని, దానిలోని కొన్ని ప్రత్యేక విషయములనుగాని పునరాలోచించుటకై శాసనసభకు పంపవచ్చును. ఇట్టి స్థితిలో ఆ చిత్తుశాసనమును శాసనసభవారు ఆ ప్రకారమే పునరాలోచించవలయును.

౧3. (అ) ఏదేని యొక శాసనసభలో ప్రవేశపెట్టబడినట్టి యొక చిత్తుశాసనము ఆమోదింపబడినచో అది రెండవ శాసనసభకు ఆలోచించుటకై పంపబడును. అట్టి రెండవ సభ సవరణలేకుండ దానితో ఏకీభవించిన పక్షమున, అది రాజుగారి అంగీకారమునకై పంపించబడును.

(ఆ) రెండవ శాసనసభ ఆ చిత్తుశాసనములో సవరణ అవసరమని తలంచిన పక్షమున, దానిని మొదటి శాసనసభకు సవరణల సూచించుచు పంపవలెను. దానిని మొదటి శాసనసభ వారు ఆలోచించవలెను. రెండవ శాసనసభవారు సూచించిన సవరణలతో వారు ఏకీభవించిన యెడల చిత్తు శాసనము అమోదింపబడినదిగా భావింపబడి రాజుగారి అంగీకారము కొరకు పంపించబడును.

అది ఆమోదింపబడిన పక్షమున, కార్యనిర్వాహక సభాధ్యక్షులు, అట్టి చిత్తుశాసనమును ఆలోచించుటకును దానిపైన వోటిచ్చుటకును ఉభయ శాసనసభలయొక్క సమిష్టి సమావేశమును కూర్పవచ్చును లేక ఈ విషయమును గురించి చర్చించుటకును ఉభయ శాసనసభల మధ్యను ఏర్పడిన భేదాభిప్రాయములను పరిష్కరించుటకును ఉభయ శాసనసభల సభాసదులుగల యొక కమిటీ నేర్పరచవచ్చును.

౧౪.(అ) ఉభయ శాసనసభలలో ఏదేని శాసనసభ, ప్రభుత్వమువారిచే సిఫారసు చేయబడినట్టిగాని మ. ఘు. వ. ప్రభువుగారివలన ౧౫వ నియమము ప్రకారము పునరాలోచన కొరకు పంపబడినట్టిగాని చిత్తుశాసనమును ప్రవేశ పెట్టుటకు లేక ఆమోదించుటకు నిరాకరించిన పక్షమున కార్యనిర్వాహక సభాధ్యక్షునివలన అది మ. ఘు. వ. ప్రభువుగారి ఆజ్ఞకొరకై పంపబడును.

(ఆ) అట్టి చిత్తు శాసనమును ఆమోదించుట, భద్రతకును, శాంతతకును, సత్పరిపాలనమునకును ముఖ్యమని కార్యనిర్వాహక సభాధ్యక్షుడు ధృవపరచిన (Certified) స్థితిలో, మ. ఘు. వ. ప్రభువుగారు తన యిష్టానుసారము, దాని నంగీకరించవచ్చును. అట్టి అంగీకారము అయిన తరువాత అది శాసనము అగును.

౧౫. శాసనములో ఏమి చెప్పబడియుండినను సరే, ౯వ నియమమునకు లోబడని విషయములలోను వెంటనే శాసనము నిర్మించుట అవసరమని తోచు విషయములలోను, ప్రభుత్వమువారు చిత్తు శాసనము సిద్ధపరచి మ. ఘు. వ. ప్రభువుగారికి పంపవచ్చును. ఇట్టి ప్రతి చిత్తుశాసనము మ. ఘు. వ. ప్రభువుగారి అంగీకారము పొందిన తరువాత, జరీదాలో ప్రకటించబడిన తారీఖు నుండి ఆరుమాసములవరకు అమలులో నుండగలదు.

౧౬. ఉభయ శాసనసభలవలన ఏదైన చిత్తుశాసనము ఆమోదింపబడినప్పటికిని, అట్టి చిత్తుశాసనము అంగీకారమునకై మ. ఘు. వ. ప్రభువుగారి సన్నిధికి పంపబడినప్పుడు శ్రీవారు తన యిష్టానుసారము, ప్రత్యేక అధికారమును గాని వీటోనుగాని ఉపయోగించుకొని నిరాకరించవచ్చును.

## తీర్మానములు; ప్రశ్నోత్తరములు:

౧౭.(అ) ౯వ నియమము క్రిందికి వచ్చునట్టి విషయములనుగురించి కౌన్సిలు, లేక, అసెంబ్లీ సభాసదుడు ఎట్టి తీర్మానమును ప్రవేశ పెట్టగూడదు; ఎట్టి ప్రశ్న గాని ఉపప్రశ్న గాని చేయగూడదు.

(ఆ) వేరువిధముగా నిర్ణయించబడిన స్థితులలో తప్ప, కౌన్సిలు, లేక, అసెంబ్లీయొక్క ఏ సభాసదుడైనను, ఏ విషయమును గురించియైనను సరే, తీర్మానము ప్రతిపాదించవచ్చును; ప్రశ్న గాని ఉపప్రశ్న గాని అడుగవచ్చును. కాని, కార్యనిర్వాహక సభాధ్యక్షుడు అట్టి ప్రశ్నకు

ప్రత్యుత్తరమిచ్చుట ప్రజాక్షేమమునకు హానికరమని ధ్రువపరచిన పక్షమున కౌన్సిలు అధ్యక్షుడుగాని అసెంబ్లీస్పీకరుగాని, ఆ సంగతి సభ్యునకు తెలిపినట్లు, అట్టి ప్రశ్నను నిషేధించవచ్చును.

(ఇ) వేరువిధముగా నిర్ణయించబడిన స్థితులలో తప్ప, పైచెప్పబడిన విధమున నిషేధించబడియుండని ఏ ప్రశ్నకైనను ఉపప్రశ్నకైనను ప్రభుత్వమువారు జవాబు చెప్పవలెను. శాసనసభవలన గాని శాసనసభలవలన గాని ఆమోదింపబడిన తీర్మానములన్నియు, సభవారి సిఫారసులంతటి ప్రాముఖ్యమును కలిగియుండును. అట్టి సిఫారసులకు ప్రభుత్వమువారు తగిన ప్రాధాన్యత నియ్యవలెను.

బడ్జెటు (మవాజనా) పైనచర్చ; వోటు ఇచ్చుట.

౧౮.(అ) రాజ్యముయొక్క వార్షిక మవాజనా, తఖ్తా రూపమున వివరములతో, ప్రతి సంవత్సరము ఉభయ శాసనసభలయెదుట ఉంచబడును.

(ఆ) కౌన్సిలు, అసెంబ్లీ సభాసదులు మవాజనాను శాసనము ప్రకారము నిర్మించబడిన నియమముల ననుసరించి చర్చించవచ్చును. మరియు కోరబడిన పైకములను వోటు (మంజూరు) చేయవచ్చును.

(ఇ) వేరువిధముగా నిర్ణయించబడిన స్థితులలోతప్ప, ద్రవ్యమును వ్యయచేయుటకు సంబంధించిన అన్ని ప్రతిపాదనలు కౌన్సిలు, మరియు అసెంబ్లీవారు వోటు చేయుటకొరకు ప్రవేశపెట్టబడును. ఈ క్రింది వ్యయవిషయములు వోటు చేయుటకొరకు కౌన్సిలు, లేక అసెంబ్లీ యెదుట పెట్టబడవు:—

(౧) ౯వ నియమము క్రిందికి వచ్చు విషయములకు సంబంధించిన వ్యయములు.

(౨) తత్కాలముల అమలులోనున్న శాసనము ప్రకారము విధాయకములైన వ్యయములు.

(౩) సర్కారీ ఋణము, దానిపైన వడ్డి మరియు సింకింగ్ ఫండు వ్యయములు.

(౪) కార్యనిర్వాహక సభాసదుల యొక్కయు, హైకోర్టు న్యాయమూర్తుల యొక్కయు, జూడిషల్ కమిటీ మెంబరుల యొక్కయు జీతములు.

(౫) రాజ్యముయొక్క ఆదాయమునుండి చెల్లించబడుచున్న పెన్షను (వజీఫా) లు, ఇనాములు (Gratuity).

(౬) కార్యనిర్వాహక సభాధ్యక్షునివలన రాజకీయములని ధ్రువపరుపబడిన (certified) వ్యయములు.

వచ్చును, లేక కోరబడిన ఏదేని మొత్తమును, అట్లు కోరబడిన మొత్తములోని ఏదైన పద్దు లేక పద్దులబాబతు ద్రవ్యమును, మొత్తము ఇంతయని నిర్ణయించిగాని వేరు విధముగా గాని తగ్గించవచ్చును.

(ఆ) కౌన్సిలువారు, కోరబడిన మొత్తమును అంగీకరించవచ్చును, లేక నిరాకరించవచ్చును కాని దానిని తగ్గించగూడదు.

(ఇ) పైన చెప్పిన అ, ఆ లలో ఏమి చెప్పియున్నను సరే, అసెంబ్లీవలనగాని కౌన్సిలువలనగాని నిరాకరించబడిన ఏదైన మొత్తము ప్రభుత్వముయొక్క జవాబుదారీలను నిర్వహించుటకు అవసరమైయున్నదని కార్యనిర్వాహక సభాధ్యక్షుడు ధృవపరచిన పక్షమున, అట్టి ధృవ పత్రముపైన మ. ఘ. వ. ప్రభువుగారు అట్టి ద్రవ్యమును అంగీకరించవచ్చును.

(ఈ) పైన ఏమి చెప్పియున్నను సరే, అవసర పరిస్థితులలో, ఏదైన శాఖ (Department) యొక్క కార్యముల జరుపుటకుగాని, శాంతి భద్రతలకు గాని, అట్టి వ్యయము వెంటనే అవసరమైయున్నదని స్థిరపరచుటకు; అసాధారణ పరిస్థితులలో, ప్రభుత్వము వారికి అధికారము కలదు.

## మిశ్రిత నియమములు,

౨౦ ప్రతి కౌన్సిలు, అసెంబ్లీ మొదటి సమావేశమునాటినుండి ౫ సంవత్సరములవరకు పని చేయును; కాని

(అ) ఏ శాసనసభనైనను అంతకుముందే మ. ఘ. వ. ప్రభువుగారు గద్దుపరచవచ్చును.

(ఆ) మ. ఘ. వ. ప్రభువుగారు పైనచెప్పిన కాలనిర్ణయమును, ప్రత్యేక కారణములవలన అవసరమను కొనినచో, పొడిగించవచ్చును కాని ఇట్టి పొడిగింపు మొత్తము రెండేండ్లకంటె మించగూడదు.

(ఇ) శాసనసభను రద్దుచేసిన మీదట మ. ఘ. వ. ప్రభువుగారు రద్దుచేసిన తారీఖునుండి ౬ నెలలకు లోపలయొక తారీఖు, ఆయా సందర్భములకు తగినట్లు, ఒక శాసనసభగాని ఉభయ శాసనసభలు గాని సమావేశమగుటకై నిర్ణయించవచ్చును,

౨౧. కార్యనిర్వాహక సభయొక్క అధ్యక్షుడును, సభ్యులును వారి కార్యదర్శులును, ఏ శాసనసభ సమావేశమునకైనను రావచ్చును. నిషేధింపబడినవి తప్ప ప్రశ్నలకు జవాబు నియ్యవల యును. కార్యక్రమమంతయు నడుపవలయును కాని శాసనము ప్రకారము అధికారముండిననే తప్ప వారికి వోటిచ్చుటకు అధికారముండదు.

౨౨. సభాకార్యముల క్రమపరచుటకును, చర్యల నడపుటకును, సభాసములను నియమించుటకును, ఎన్నుకొనుటకును, వోటిచ్చు యోగ్యతలను గురించియు, ప్రాంతీయ నియోజక వర్గములరచన

విషయమునను, ప్రశ్నలను ఇతర విషయములను క్రమపరచుటకును నిబంధనలు నియమముల ద్వారా చేయవచ్చును;

## వోటిచ్చుటకు నిబంధనలు

౨౩.(అ) ప్రతి ప్రాంతీయ నియోజక మండలముకొరకు ఒక వోటరుల పట్టిక యుండగలదు. తత్కాలమున అట్టి పట్టికలో పేరు చేర్చబడియుండని ఏ మనుష్యుడును ఆ నియోజక మండలములలో వోటిచ్చుటకు హక్కు కలిగియుండదు.

(ఆ) ప్రాంతీయ నియోజక మండలములోపలి యింటియందు వెనుకటి సంవత్సరమున అధమము మూడు నెలలైనను కాపురముండనివాడు ఆ మండలపు వోటరుల పట్టికలో పేరు చేర్చబడు హక్కు కలిగియుండజాలడు. ఒక యింటిని అప్పుడప్పుడు వాడుకొనుచుండిన పక్షమున అతడు ఆ యింటియందు ఉండినట్లుగా భావించబడును. ఆయింటికి ఎప్పుడు తలచినచో అప్పుడు వచ్చుటకు స్వాతంత్ర్యము కలిగియున్న పక్షమున, ఆ యింటిలో కాపురముండుట లేదను కారణమున ఆ యింటిలో ఉండువాడు కాదని భావించబడదు.

## లెజిస్లేటివ్ అసెంబ్లీ; వోటర్ల యోగ్యతలు

౨౪. శాసనము ననుసరించి చేయబడిన నియమములకు లోబడి, ఏ మనుష్యుడైనను అసెంబ్లీకి వోటరుగాపట్టికలో పేరు చేర్పించుకొనుటకు కావలసిన యోగ్యతలివి:—

(అ) గత ఫసలీ సంవత్సరపు రెండు అర్ధ సంవత్సరములలోను, ఏదైన జిల్లా మునిసిపాలిటీకి సంవత్సరమునకు జిల్లా ప్రధాన స్థలములలో కిరాయా విలువ రు. ౨౪లు కల యింటిపైన యింటిపన్ను చెల్లించియుండుట.

(ఆ) గత ఫసలీ సంవత్సరపు రెండు అర్ధ సంవత్సరములలోను, హైదరాబాదు పురపాలక సంఘమునకు సంవత్సరపు కిరాయ విలువ రు. ౭౪లు గల యింటిపైన పురపాలక సంఘ శాసనము ప్రకారము యింటిపన్ను చెల్లించియుండుట.

(ఇ) అ, ఆ, వాక్యములలోని ఆస్తికి గత ఫస్లీ వత్సరపు పన్ను చెల్లించబడిన యింటిలో కిరాయకు ఉండుట గాని,

(ఈ) సంవత్సరమునకు రు. ౫౦లకు తక్కువగా పొందని మసుము దారు, యోమియాదారు, మిరాసీదారు, దస్తుబందుదారు, లేక ఇతర నగదు మాషుకలవాడుగా ఉండుట.

(ఉ) రు. ౧౦ ధారాగల ఖుష్కి భూమికిగాని, రు. ౧౬ల ధారాగల తరీ భూమికిగాని పట్టాదారు, షిక్మీదారు, కవులుదారు, లేక ఆసామి షిక్మి, లేక ఇనాముదారుగా ఉండుట.

గాని, మెట్రిక్యులేషను పరీక్షలోగాని, దానికి సమమైనదిగా అంగీకరింపబడిన ఏదైన పరీక్షలో గాని కడతేరి ఉండుట.

(ఋ) జిల్లా ప్రధాన స్థలముల విషయములో, మిడిలు పరీక్షలోగాని దానికి సమామైనదిగా అంగీకరింపబడిన మరేదైన పరీక్షలోగాని కడతేరి యుండుట.

(ౠ) ఇతర గ్రామ నియోజక మండలముల విషయములో, చదువువచ్చినవాడు, అనగా ఉత్తరము వ్రాయను చదువను గలిగియుండుట.

## లెజిస్లేటివ్ కౌన్సిలు:

౨౫. ఈ శాసనము ప్రకారము చేయబడు నియమములకు లోబడి, ఏదైన ప్రాంతీయ నియోజక మండలము తరపున, ఏ మనుష్యుడైనను కౌన్సిలుకు వోటరుగా పట్టికలో పేరు చేర్పించుకొనుటకు కావలసిన యోగ్యతలివి:—

(అ) గత ఫసలీ సంవత్సరము బాబతు ఆ సంవత్సరము సొంతముకొరకు మోటారు బండి పన్ను చెల్లించి యుండుట.

(ఆ) గత ఫసలీ సంవత్సరము రెండు అర్ధ సంవత్సరముల కొరకును, కిరాయ వార్షిక విలువ రు. 300 గల యింటి పన్ను హైదరాబాదు పురపాలక సంఘమునకు చెల్లించి యుండుట.

(ఇ) గత ఫసలీ సంవత్సరపు రెండు అర్ధ సంవత్సరముల కొరకును, ఏదైన జిల్లా మునిసిపాలిటీకి కిరాయ వార్షిక విలువ రు. ౧౨౦లు గల యింటి పన్ను చెల్లించి యుండుట.

(ఈ) ఆ, ఇ, ప్రకారము పన్ను చెల్లించబడిన యింటిలో పూర్తిగా సంవత్సర కాలము కిరాయాకు ఉండుట; లేక

(ఉ) సంవత్సరమునకు ౧౦౦లకు తక్కువ కానట్టి మాల్గుజారీ పన్ను విధింపదగిన భూమికి, పట్టాదారు, లేక షిక్మిదారు, లేక అసామిషిక్మీ, లేక ఇనాందారుగా ఉండుట.

(ఊ) సంవత్సరమునకు రు. ౨౫౦ల మాషుగల రుసుముదారు, యోమియాదారు, మిరాసీదారు దస్తుబందుదారు, లేక ఇతర నగదు మాషుదారు.

లక, మన్సబుదారు, లేక, సివిలు వజీఫాదారుగా నుండుట.

(ఋూ) మూడు సంవత్సరముల అనుభవముగల అంగీకరింపబడిన విశ్వవిద్యాలయ పట్టభద్రుడైయుండుట. అయినను, అతడు ఏదేని అంగీకరింపబడిన విద్యాసంస్థయందు విద్యాభ్యాసము చేయుచున్నవాడుగా నుండగూడదు.

(ౠ) మ. ఘ. వ. నిజాము ప్రభువుయొక్క సక్రియ సైన్యమునందు, విడుదల పొందినట్టిగాని, విశ్రాంతి గొన్నట్టిగాని వజీఫా పొందినట్టిగాని అధికారియై యుండగూడదు.

వివరణము; "అధికారి" అను మాటలో "సొల్జరు" గాని "ప్రైవేటు" గాని చేరదు. కాని కమిషను అధికారి, గాను కమిషను అధికారి చేరుచున్నాడు.

## స్త్రీల విషయమున అధిక యోగ్యత

౨౬, పైన చెప్పిన నియమములకు లోబడి, స్త్రీయైయున్న మనిషి, ఆమె భర్తకు అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ నిబంధనలలోగల యోగ్యతయున్న పక్షమున, ఏదైన ప్రాంతీయ నియోజకమండలము పక్షమున, లెజిస్లేటీవ్ అసెంబ్లీయొక్క వోటర్ల పట్టికలో పేరు చేర్పించుకొనుటకు అర్హురాలగుచున్నది.

## అది హిందువులకు అధిక యోగ్యత

౨౭. పైనచెప్పిన నియమములకు లోబడి. ౧౯౩౧ వ. జన పరిగణన నివేదికలో "ఆదిహిందు" కులమునకు సంబంధించినట్టి ఏ మనుష్యుడైనను సరే, అతడు గ్రామపు ధేడుగాగాని చమారుగాగాని, మహారుగాగాని మాంగుగాగాని, మాలగాగాని, మాదిగగాగాని బలోతా దారు అధికారము కలవాడైన పక్షమున, ఏదైన ప్రాంతీయ నియోజకమండలము పక్షమున లెజిస్లేటీవ్ అసెంబ్లీ వోటర్ల పట్టికలో పేరు చేర్పించుకొనుటకు అర్హుడైయుండును.

## ఇతర సంఘముల స్థాపనము.

౨౮.(అ) సగము అధికారులును, సగము అధికారేతరులును, సభ్యులుగాగల ఈ క్రింది ఆలోచన సంఘములు ఏర్పరుపవలెను. ౧. రైల్వే మరియు రాకపోకల సంఘము. ౨. కేంద్ర విద్యాసంఘము 3. వర్తక, పారిశ్రామిక సంఘము. ౪. ఆర్థిక సంఘము. ౫. ప్రభుత్వోద్యోగ సంఘము.

(ఆ) ఈ సంఘములు అప్పుడప్పుడును, ప్రభుత్వమువారివలన పిలువబడినపుడును, సమావేశమై, తమ యధికారమునకు లోబడియుండు విషయములలో ప్రభుత్వమువారికి ఆలోచన చెప్పవలెను. వీరి ప్రతిపాదనలు సిఫారసులవంటి బలము మాత్రము కలిగియుండును. అయినను, వారు సూచించిన పద్ధతులను గురించియు, పాలిసీలను గురించియు ప్రభుత్వమువారు తగినంత శ్రద్ధవహించి దానిని అమలుపరచుటకు యత్నించవలెను.

సంఘము (Standing Finance Committee) ఒకటియుండవలెను. , అధ్యక్షునితో చేరి ౯ మందికంటె మించని సభాసదులుందురు. వీరిలో 3 గురిని అసెంబ్లీలోని అధికారేతర సభ్యులును ౨ రిని కౌన్సిలులోని అధికారేతర సభ్యులును ఎన్నుకొనెదరు. మిగిలినవారిని ప్రభుత్వమువారు నియమింతురు.

(ఆ) ఈ విధముగా నిర్మింపబడిన కమిటీవారు, ఆదాయమును ఉపయోగించు అన్ని విషయములతోను, శాసనసభలు వారి కప్పగించిన ఆర్థిక విషయములగు ప్రతిపాదనలతోను, సంబంధము కలిగియుండి అట్టి అన్ని విషయములలో ఆలోచన చెప్పుదురు.

౧౦. ౧౦ సంవత్సరముల తర్వాత మ. ఘ. వ. నిజాము ప్రభువుగారివలన, అధికార అధికారేతర సభ్యుల కలిసియుండునట్లు ఏర్పరుపబడిన కమీషనువలన, ఈ రాజ్యాంగ విధానము (Constitution) పరిశీలించబడి ఆ కాలపు స్థితి గతులకు తగియుండునట్లు అవసరములగు మార్పులు దానిలో చేయబడును.

## కార్యనిర్వాహక సభ (బాబెహుకుమత్)

౧.(అ) రాజ్యముయొక్క కార్యనిర్వహణాధికారము మ. ఘ. వ. నిజాము ప్రభువులైయుండి, శాసనము యొక్క నియమములకును, రాజ్యముయొక్క శాసనములకును లోబడియున్న కార్యనిర్వాహక సభయొక్క అధికారములను కర్తవ్యములను గురించి తత్కాలమున అమలులోనుండు మ. ఘ. వ. ప్రభువుగారి అజ్ఞలకులోబడియును, శ్రీవారివలన ఏర్పరుపబడిన కార్యనిర్వాహక సభవారివలన అమలులో పెట్టబడుచుండును.

(ఆ). తత్కాలము అమలులోనున్న నియమము ప్రకారము మ. ఘ. వ. ప్రభువువలన నియోగింపబడిన కార్యనిర్వాహక సభలో అధ్యక్షుడును, సభ్యులును ఉందురు. అయినను, ఆ సభలోనుండు సభ్యులలో సగముమందిని మ. ఘ. వ. ప్రభు, లెజిస్లేటివ్ అసెంబ్లీలోనుండి ఎన్నుకొనబడిన సభ్యులగువారినే నియోగించెదరు.

(ఇ) అసెంబ్లీలోని ఎన్నుకొనబడిన సభ్యులలో కొందరు కార్యనిర్వాహక సభ్యులుగా నియోగింపబడినప్పుడు అసెంబ్లీలో వారి స్థలములు ఖాలీయగును. ఇట్టి కార్యనిర్వాహక సభ్యులు మ. ఘ. వ. ప్రభువుచే వారి కప్పగింపబడిన శాఖల పనుల నిర్వహింతురు.

(ఈ) కార్యనిర్వాహక సభ తన కర్తవ్యముల నిర్వహించుటలోను ఆలోచన చెప్పుటలోను మ. ఘ. వ. ప్రభువుగారికి జవాబుదారులైయుండును. అట్లే, సభ్యులువారికి అప్పగింపబడిన శాఖలను గురించిన సర్వ విషయములలోను సమిష్టిగా శాసనసభకుకూడ జవాబుదారులై యుందురు.

(ఉ) కార్యనిర్వాహక సభ్యులను నియోగించుట, పనినుండి తొలగించుట మ. ఘ. వ. ప్రభువుగారి యధికారములోనుండును. కాని ఉభయశాసనసభల మొత్తము సభ్యులలో అయిదింట నాల్గు భాగముల బహుళ సంఖ్యాకులు విశ్వాసరాహిత్య తీర్మానమును ఆమోదించిన పక్షమున,

౮౨. మ. ఘ. వ. ప్రభుత్వ ప్రజలకు [illegible]
ప్రకటించును. అట్టి హక్కులలో ఈ క్రిందివి చేరియున్నవి,

(అ). అభిప్రాయమును స్వతంత్రముగా ప్రకటించుటకును, శాంతముగా సమావేశమగుటకును, ప్రజాశాంతికిని నీతికిని భంగకరము కాని సంఘములను స్థాపించుకొనుటకును హక్కు.

(ఆ). ప్రజాశాంతికి నీతికి లోబడి, అంతరాత్మ స్వాతంత్ర్యమునకును, తన మతమును ప్రకటించుకొనుటకును, ఆ సంబంధమైన కర్మకాండ ఆచరించుకొనుటకును హక్కు.

(ఇ). పై నియమములకు లోబడి ముద్రణశాలల స్వాతంత్ర్యపు హక్కు,

(ఈ). పౌరులందరికిని పబ్లికు బావులకు ఇతర పబ్లికు ప్రదేశములకు పోవుటకును, ఉపయోగించుకొనుటకును హక్కు.

## స్థానిక స్వపరిపాలనము.

౧. ౧౦౦౦ మందికి తక్కువగాని జనసంఖ్యగల ప్రతి గ్రామమునకును, మొత్తమునకు అంతే జనసంఖ్యగల చుట్టుపట్టుననుండు గ్రామముల సమూహమునకును, ఒక గ్రామ పంచాయతీ ఉండవలయును. ఈ విషయమున నిర్మింపబడు నియమముల ననుసరించి గ్రామపరిపాలనము అట్టి పంచాయతీకి అప్పగింపబడును.

౨. పంచాయతీలో ౭ కంటె తక్కువగాని ౯ కంటె ఎక్కువగాని కానంత మంది సభ్యులు ఉందురు; ఈ సంఖ్యను ప్రతి పంచాయతీ విషయమున ప్రభుత్వమువారు నిర్ణయింతురు.

3. పంచాయతీ సభ్యులు ఆ పంచాయతీకి సంబంధించిన ఆ గ్రామమున, లేక గ్రామములందు కాపురముండు వారైయుండవలెను. వీరిలో కొందరు ఎన్నుకొనబడువారును కొందరు నియమితులైనవారును ఉందురు. ఎన్నుకొనబడువారి సంఖ్య మొత్తముసంఖ్యలో సగముకంటె తక్కువ కాకూడదు.

౪. శాసనము ప్రకారము వేరువిధముగా నిషేధింపబడిననే తప్ప, గ్రామములో నివసించునట్టి ప్రతి పురుషుడు, ౨౧ సంవత్సరముల వయసునిండినవాడు, గ్రామ పంచాయతీ సభ్యుల ఎన్నికలలో వోటు యిచ్చుటకు అర్హుడగును.

౫. ప్రతి [illegible] అతడు పంచాయతీదారులలోనుండి ప్రభు [illegible] గ్రామ పంచాయతీల నియమావళి ప్రకారము పంచాయతీ సంబంధమైన [illegible] ఉండవలెను.

౬. దీనికి భిన్నముగా విధించబడియున్ననే తప్ప, పంచాయతీ వారియెదుటకు వచ్చిన విషయము లన్నియు, ఆ సభకువచ్చిన వోటిచ్చిన సభ్యుల బహుజనాభిప్రాయానుసారము తీర్మానించ బడును. అధ్యక్షునికి అధికవోటు (Casting vote) అధికారముండును.

౭, ఒక పంచాయతీ ఒక సంవత్సర కాలము జరుగుచుండును. ఎన్నికలు ప్రస్తుతము, చేతు లెత్తుటవలన జరుగును.

౮. పంచాయతీవారు, తమ స్వాధీనమందుండు ద్రవ్యముయొక్క అవకాశమును బట్టి, తమ అధి కారము క్రిందనున్న ప్రాంతములో ఈ క్రింది విషయములందు ఏర్పాటుల చేయవలసిన వారై యుందురు.

వీధుల పరిశుభ్రత; త్రాగుటకు నీటి వసతులను కట్టించుట, మంచి స్థితిలో నుంచుట, బాగుపరచుట; మురికి కాలువలను ఆరోగ్యసాధనములను కట్టించుట; బందెల దొడ్లపైన అధికారము, వ్యవస్థ; సర్కారు (పబ్లికు) యిండ్లపైన అధికారము; పబ్లికుదారులు పబ్లికు ప్రదేశ ములలో దీపముల ఏర్పాటు; గ్రామపు అడవుల అధికారము, వ్యవస్థ; పేదవారికిని రోగులకును సహాయము; పశువుల మేత; భూములపైన అధికారము; పంచాయతీ అధికార ప్రాంతములో భద్రత, ఆరోగ్యము, సౌఖ్యము, అనుకూలములు వీనిని కలిగించునట్టి ఇతర కార్యములు.

౯. శాసనము ప్రకారము ఈ విషయమున నిర్మింపబడు నియమములకు లోబడి, పంచాయతీవారు శాసనము ప్రకారము తమ కప్పగింపబడిన విధుల నెరవేర్చుట కవసరములగు పనుల నన్నిటిని చేయుటకు అధికారము కలిగియుందురు.

౧౦. ప్రతి గ్రామమునందును "గ్రామ పంచాయతీ నిధి" ఉండగలదు. ఈ ధనమును పంచాయతీ వారు తమ కర్తవ్యముల నెరవేర్చుటకై ఉపయోగింతురు.

౧౧. పన్నులు, జరీమానాలు, బందెలదొడ్డివలన మిగులునట్టి ధనము, ప్రభుత్వమువారుగాని, ఎవ్వరైన వ్యక్తిగాని యిచ్చినట్టి ధనము, పంచాయతీవారి ఆధీనములోనున్న ఆస్తి విక్రయమువలన వచ్చు ధనము, ప్రభుత్వమువారివలన పంచాయతీలదిగా అప్పజెప్పబడిన అదాయధనము, ఇవన్నియు గ్రామ పంచాయతీఫండు క్రింద జమకట్టబడును.

౧౨. పంచాయతీకి సంబంధించిన ప్రాంతములలో నుండువారివద్దినుండి రూపాయకు అణాచొప్పున వసూలుచేయబడు లోకల్ఫండులో సగము, ప్రభుత్వమువారు పంచాయతీవారికి గ్రామ పంచా యతీ నిధిలో చేర్చుకొనుటకై యిచ్చెదరు.

౧౩, జిల్లాలలోని పంచాయతి పరిపాలనను గురించిన సర్వాధికారములు తాలుకుదారు అయి యుండవలెను.

౧౪. ప్రతి సంవత్సరము ఆదాయ వ్యయముల బడ్జెటు (మవాజనా)ను సిద్ధపరచి, దానిని ఆమోదించుటకును, అంగీకరించుటకును అధికారముగల తాలుకుదారుకు పంపుచుండవలెను.

## చిన్న మునిసిపాలిటీలు

౧౫. ౨౦౦౦ జనసంఖ్యగల ప్రతి యూరు మునిసిపాలిటీయని ప్రకటింపబడును. అట్టి ప్రతి పురమునకు పురపాలక సంఘము ఉండును.

౧౬. పురపాలక సంఘములో ౯ నుండి ౧౧ మంది వరకు సభ్యులుందురు. వీరిలో కొందరు నియమింపబడినవారును కొందరు ఎన్నుకొనబడినవారును ఉందురు. ఎన్నుకొనబడినవారి సంఖ్య మొత్తము సభ్యుల సంఖ్యలో సగముకంటె తక్కువ గాక యుండును.

౧౭. ప్రతి పురపాలక సంఘమునకును ఒక అధ్యక్షుడును, ఒక ఉపాధ్యక్షుడును ఉండును. అధ్యక్షుడు తాలుకుదారువలన నియమింపబడుచుండును.

౧౮. ఉపాధ్యక్షుడు, ఎన్నుకొనబడిన సభాసదులలోనుండి ఎన్నుకొనబడును.

౧౯. మునిసిపాలిటీలు లేక పురపాలక సంఘమువారు, వారి అధికారము క్రిందనుండు ప్రదేశములో ఈ క్రింది పనులుచేయుట విధాయకమై యుండును:—

దీపములు వెట్టించుట; పబ్లికు వీధులలోను ప్రదేశములలోను నీరు చల్లించుట, పరిశుభ్రపరచుట; ఇండ్లుకట్టుటను క్రమపరచుట; మార్కెటులు, పాయఖానలు, పబ్లికు వీధులు, మురికి కాలువలు, బావుల మొదలగునట్టి ప్రజోపయోగకరములగు కట్టడములను కట్టించుట, మంచి స్థితిలోనుంచుట; త్రాగుటకు నీటి వసతులుచేయుట; సాంక్రామిక రోగాలు తొలగించుట; జనన మరణములు వ్రాసియుంచుట; ఔషధశాలల స్థాపించుట, నిర్వహించుట; నష్టదాయకములగు వృత్తులను, రాకపోకలను క్రమపరచుట మొ.

౨౧. ప్రతి మునిసిపాలిటీకి, "మునిసిపలునిధి" అనునదియుండును. పురపాలక సంఘమువారు వేయు పట్టిపన్నులు, టోలులు మొదలైన సైకములును, న్యాయస్థానముల వారిప్పించు సైకములును విధించు జరిమానాలును, శాసనము ప్రకారమును ఈ విషయమున ప్రభుత్వమువారు నిర్మించు నియమముల ప్రకారమును పురపాలక సంఘములకు ఏయే సైకములు పొందుటకు అధికారము కలదో అట్టి ద్రవ్యములును, ఈ మునిసిపలు నిధిలో జమకట్టుకొనబడును. ఈ నిధిని పురపాలక సంఘమువారు, పురపరిపాలన కార్యముల (Municipal gov.. కొరకు వినియోగింతురు.

౨౨. శాసనమునను సరించి, తాలుకుదారు ఇట్టి మునిసిపాలిటీలను పరిశీలించుటకును అధికారములో నుంచుకొనుటకును అర్హత కలిగియుండును.

## జిల్లా సంఘములు (District Boards)

౭౩. జిల్లా సంఘమునకొక అధ్యక్షుడును, ౧౨ కంటె తక్కువగాని ౧౬ కంటె ఎక్కువగాని సంఖ్యగల సభ్యులును ఉందురు. సభ్యులలో మూడింట రెండు భాగములవారు ఎన్నుకొనబడినవారుగానుందురు.

౭౪. జిల్లా సంఘముల నెన్నుకొను నియోజకవర్గములకుండవలసిన యోగ్యతలు లెజిస్లేటివ్ అసెంబ్లీ వానివంటివే యైయుండును.

౭౫. జిల్లాలోని ప్రతి తాలూకా ఒక నియోజక మండలముగానుండును. అది జన సంఖ్యను బట్టి ఎక్కువ సభాసదుల నెన్నుకొను మండలముగానో ఒక సభాసదు నెన్నుకొను మండలముగానో, ప్రకటింపబడును.

౭౬. జిల్లాసంఘమునకు జిల్లా తాలుకుదారు అధ్యక్షుడుగానుండును. ఉపాధ్యక్షుడు ఎన్నుకొనబడును.

౭౭. ప్రతి జిల్లాసంఘమువారును తమ అధికారముక్రిందనుండు ప్రదేశములో ఈ క్రింది పనులు చేయవలెను:—

రాకపోక మార్గములను కట్టించుట, మరమ్మతుచేయుట, మంచి స్థితిలోనుంచుట; పబ్లికు రోడ్డులమీద చెట్లునాటించుట, వానిని కాపాడుట, పబ్లికు సంస్థలకు సంబంధించిన కట్టడముల కట్టించుట, పబ్లికు బావులు మొదలగువానిని తోడించుట, వాని మరమ్మత్ చేయుంచుట, ఇట్టివే యితర కార్యముల చేయించుట.

మాడపాటి హనుమంతరావు, అధ్యక్షుడు.
గోవిందరావు నానలు.
శ్రీపతిరావు పల్నిట్కరు, బి. ఏ. ఎల్ ఎల్. బి.
కొండా వేంకటరంగారెడ్డి ఎం. ఎల్. సి.
రామాచారి.
జనార్దనరావు దేశాయి.
ఎన్. నందీపతి.
జి. మారెటు.
ఆర్. లక్ష్మయ్య.
పి. ఆర్. వెంకట్రామస్వామి.
గణపతిరావు దేశపాండే.
పన్నాలాలు పితీ.
గణపతిలాలు.
డి. డి. ఇటాలియా.
పి. వి. జోషీ బి. ఏ. ఎల్ ఎల్. బి.
మా. వెం. భాగ్యరెడ్డి వర్మ.
శ్రీనివాసరావు మదునూర్కరు
సయ్యద్ సిరాజుల్ హసన్ తిర్మిజీ. *
మందుముల నరసింగరావు. *
శ్రీనివాసరావు శర్మ, బి. ఏ., బారిష్టరు. *
బూర్గుల రామకృష్ణారావు, బి. ఎ. ఎల్ ఎల్. బి. *
తిరుమల కృష్ణ శర్మ. *

* కార్యదర్శులు.

# అనుబంధము

## లెజిస్లేటివ్ అసెంబ్లీ

మొత్తము సీట్లు [illegible]

[illegible]

[illegible]

| | | | |
|---|---|---|---|
| విశ్వవిద్యాలయములు | | ప్రత్యేక (సంఖ్యావారి) జనులు | |
| వాణిజ్యము, పరిశ్రమలు | ౨ | హరిజనులు | ౧౧ |
| సాహుకార్లు బాంకర్లు | ౩ | ఆంగ్లో ఇండియనులు | ౧ |
| జాగీరుదార్లు | ౪ | క్రైస్తవులు | ౧ |
| జమీందార్లు | ౫ | సిక్కులు | ౧ |
| స్త్రీలు | ౫ | పార్సీలు | ౧ |

సాధారణ నియోజక మండలములు ౧౩౦

| నగరములవి ౫౨ | | గ్రామములవి ౭౮ | |
|---|---|---|---|
| హైదరాబాదు | ౧౬ | అత్రాఫ్ బల్దా | ౩ |
| వరంగలు | ౪ | వరంగలు | ౫ |
| కరీంనగరము | ౨ | కరీంనగరము | ౭ |
| ఆదిలాబాదు | ౨ | ఆదిలాబాదు | ౪ |
| మెదకు | ౨ | మెదకు | ౪ |
| నిజామాబాదు | ౨ | నిజామాబాదు | ౪ |
| నల్లగొండ | ౨ | మహబూబు నగరము | ౫ |
| మహబూబు నగరము | ౨ | నల్లగొండ | ౭ |
| ఔరంగాబాదు | ౩ | ఔరంగాబాదు | ౫ |
| బీడు | ౨ | బీడు | ౪ |
| నాందేడు | ౩ | నాందేడు | ౪ |
| పర్భని | ౨ | పర్భని | ౫ |
| గుల్బర్గా | ౩ | గుల్బర్గా | ౬ |
| ఉస్మానాబాదు | ౨ | ఉస్మానాబాదు | ౪ |
| రాయచూరు | ౩ | రాయచూరు | ౬ |
| బీదరు | ౨ | బీదరు | ౫ |

# అనుబంధము (ఆ)

## లెజిస్లేటివ్ కౌన్సిలు.

మొత్తము సీట్లు ౬౫

ప్రభుత్వమువలన నియమింపబడినవి ౧౬ అసెంబ్లీనుండి ఎన్నుకొనబడినవి ౧౬

సాధారణ నియోజక మండలములు ౩౩

| | | | |
|---|---|---|---|
| హైదరాబాదు | ౫ | మహబూబునగరము | ౨ |
| వరంగలు | ౨ | ఔరంగాబాదు | ౨ |
| ఆదిలాబాదు | ౧ | ఉస్మానాబాదు | ౧ |
| నిజామాబాదు | ౧ | బీడు | ౧ |
| నల్లగొండ | ౨ | నాందేడు | ౨ |
| బీదరు | ౨ | పర్భని | ౨ |
| అత్రాఫ్ బల్దా | ౧ | గుల్బర్గా | ౩ |
| కరీంనగరము | ౩ | రాయచూరు | ౨ |
| మెదకు | ౧ | | |